# గురజాడ రచనలు

# కన్యాశుల్కం

రెండు కూర్పుల సంపుటం
(1897, 1909)

సంపాదకుడు
సెట్టి ఈశ్వరరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435 విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

ప్రచురణ సంఖ్య: 1176

ప్రతులు · 1,100

గురజాడ రచనలు కన్యాశుల్కం 1897, 1909 కూర్పులు.



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్ - 1.

ప్రథమ ముద్రణ : 1986 సెప్టెంబరు

Publication No. 1176

No. of copies : 1,100

Edition 1st Edition, September 1986

| | |
|---|---|
| Title | GURAZADA RACHANALU<br>*Kanyasulkam* 1897, 1909 Editions |
| Editor | C Eswara Rao |
| Publishers | Visalaandhra Publishing House<br>4-1-435, Vignana Bhavan, Bank Street,<br>Hyderabad - 500 001. |
| Branches | Visalaandhra Book House<br>Hyderabad (Bank Street & Sultan Bazaar)<br>Vijayawada, Visakhapatnam (Main Road & at Russian Shopping Complex, Steel Plant Township), Guntur, Tirupati, Hanumakonda, Anantapur |

Subject : Drama, *Kanyasulkam* (1897, 1909 editions)

**Price : Rs. 25.**

Printed by Stree Seva Mandir Press
Saligramam, Madras - 600 093

# విషయసూచిక

# మనవి

'కన్యాశుల్కం' మొదటి కూర్పు. రెండో కూర్పు మేము ప్రచురిస్తూన్న గురజాడ రచనల గ్రంథాలలో మూడు. నాలుగు సంపుటాలు. ఇటీవలనే ప్రచురించిన మొదటి రెండు సంపుటాలు—"కవితల సంపుటం", "కథానికలు" ప్రతులు కొద్ది కాలంలోనే చెల్లిపోయినందువల్ల — పునర్ముద్రణ చేయబోతున్నాము కన్యాశుల్కం సంపుటాలను కూడా యిదేవిధంగా పాఠకలోకం ఆదరించగలదని ఆశిస్తున్నాము

కన్యాశుల్కం మొదట 1892లో ప్రదర్శింపబడింది తొలి ముద్రణ 1897 లోనూ, రెండో ముద్రణ 1909 లోనూ జరిగాయి. మొదటి ముద్రణను ఆమూలాగ్రం సంస్కరించి గురజాడ రెండో కూర్పును ప్రచురించారు గురజాడ సాహిత్య సంపదలో అతి ముఖ్యమైన వాటిలో ఒకటైన కన్యాశుల్కం అధ్యయనానికి, దాని రెండు కూర్పుల తులనాత్మక పరిశీలనకు ఉపకరించేందుకు, రెండు కూర్పులను ఒకే సంపుటంగానూ, రెండో కూర్పును విడిగా ఒక సంపుటంగానూ యిప్పుడు ప్రచురిస్తున్నాము ఇందు నిమిత్తం విపులమైన పీఠిక, పాద పీఠికలు, వివరణలు, వ్యాఖ్యలు, గురజాడ జీవిత సమాచారం మొదటి రెండు సంపుటాలలో లాగానే వీటిలోనూ వున్నాయి ఆధునికాంధ్ర సాహిత్యానికి ఆది కావ్యమైన యీ నాటకం, యీ విధంగా ఎన్నడూ ప్రచురణ కాలేదని విజ్ఞులకు చెప్పవలసిన పనిలేదు ఇదికాక, గురజాడ సాహిత్యాన్నంతటినీ చారిత్రక నేపథ్యంలో అధ్యయనం చేయడానికి ఉపకరించేందుకు "విశాలాంధ్ర" దినపత్రికలో 1984 నవంబరు 4 మొదలుకొని, 15 సంచికలలో పెద్ద వ్యాసం ప్రచురింపబడింది.

ఈ సంపుటాల తరవాత, గురజాడ వాడుక భాషా ఉద్యమ సందర్భంగా 1914లో మద్రాసు విశ్వవిద్యాలయానికి సమర్పించిన "అసమ్మతి పత్రం" ఐదవ సంపుటంగానూ; "కొండుభట్టీయం", "బిల్హణీయం" అన్న రెండు అసంపూర్ణ నాటకాలు ఆరవ సంపుటంగానూ వెలువడుతాయి

విశాలాంధ్ర ప్రచురణాలయం, గురజాడ రచనలతో పాటుగా ఎన్నో ఉత్తమ సాహిత్య గ్రంథాలు, యితర గ్రంథాలు ప్రచురించి పాఠకుల ఆదరాభిమానాలు పొందింది ఈ సంపుటాలను కూడా పాఠకులు ఆదరించగలరని ఆశిస్తూ...

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

# గురజాడ వెంకట అప్పారావు జీవిత వివరాలు

గురజాడ వెంకట అప్పారావు కుటుంబం, తాతల కాలంలో కృష్ణాజిల్లా గురజాడ గ్రామం నుండి విశాఖ మండలానికి తరలి వచ్చింది.

తండ్రి వెంకట రామదాసు, తల్లి కౌశల్యమ్మ

తండ్రికి సంస్కృతంలో మంచి ప్రవేశం వుండేది. ఆయన విజయ నగరం సంస్థానంలో పేష్కారుగానూ, రెవెన్యూ సూపర్‌వైజర్‌గానూ, ఖిల్లే దారుగానూ ఉద్యోగాలు చేశారు. విజయనగరానికి చేరువలోని ఊటగెడ్డ అన్న ఏరు బండిలో దాటుతూ వుండగా, హటాత్తుగా ఆ ఏరు పొంగడంవల్ల మునిగిపోయి మరణించారు.

1862 సెప్టెంబరు 21 పుట్టిన తేదీ. జననం మాతామహుల యింట విశాఖజిల్లా, ఎలమంచిలి తాలూకా, రాయవరం గ్రామంలో.

జాతకాన్ని బట్టి పుట్టుక తేదీని లెక్క కట్టడంలో తేడా లున్నాయి. ఒకదాని ప్రకారం 1861 నవంబరు 30, యింకోదాని ప్రకారం 1862 సెప్టెంబరు 21. ఆయన మనుమలు రెండోదాన్ని ధ్రువపరుస్తున్నారు.

తండ్రి చీపురుపల్లిలో ఉద్యోగం చేస్తున్నప్పుడు, పదేళ్ల వయస్సు వరకూ అక్కడ చదువు. తరవాత బి ఏ, పట్టం పుచ్చుకునే వరకు విజయ నగరంలో గిడుగు రామమూర్తితో కలిసి చదువుకున్నారు ఇద్దరూ చిన్నప్ప ట్నుంచీ ప్రాణమిత్రులు

1882 మెట్రిక్యులేషన్.

హైస్కూలు చదువుకాలంలో శ్లోకాలు రాసేవారట. విద్యాభ్యాస దశ పేదరికంలో సాగింది ఉదారుడైన విజయనగరం మహారాజ కాలేజి ప్రిన్సి పాల్ సి. చంద్రశేఖర శాస్త్రి యింట వసతి, భోజనం

1882 "కుక్క" అన్న ఇంగ్లీషు పద్యం ప్రచురణ

1882-1884 యఫ్ ఏ.

1883 "సారంగధర" అన్న ఇంగ్లీషు పద్యకావ్య ప్రచురణ. తమ్ముడు శ్యామలరావూ, తానూ విజయనగరంలోని "ఇండియన్ లీజర్ అవర్", "తెలుగు హార్ప్" అన్న పత్రికల్లో ఇంగ్లీషు పద్యాలు రాస్తూ వుండేవారు. "ఇండియన్ లీజర్ అవర్" లో వెలువడిన "సారంగదర"ను మెచ్చుకొని, అప్పటి ప్రముఖ కలకత్తా పత్రిక "రీస్ అండ్ రయ్యత్" (రాజు, రైతు) అన్న ఇంగ్లీషు పత్రికాధిపతి, శంభుచంద్ర ముఖర్జీ దానిని తన పత్రికలో రెండోసారి ప్రచురించారు (ప్రచురణ అగస్టు 11, 18 సంచికలు); ఎంతో ప్రోత్సహిస్తూ ఉత్తరం రాశారు ఇద్దరి మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి. ప్రారంభ దశలో ప్రోత్సహించిన వారిలో, "ఇండియన్ లీజర్

అవర్" సంపాదకుడు గుండుకుర్తి వెంకటరమణయ్య ఒక ముఖ్యుడు. "చంద్ర హాస" అన్న యింకో పెద్ద ఇంగ్లీషు కావ్యం కూడా రాశారట. "కుక్కు" లాగనే, యిది కూడా అలభ్యం.

1884-1886 బి.యే., ఫిలాసొఫీ అభిమాన శాస్త్రం. రెండో భాష సంస్కృతం.

1884 విజయనగరం మహారాజ కాలేజి హైస్కూలులో ఉపాధ్యాయ పదవి. జీతం 25 రూపాయలు.

1885 వివాహం. భార్య అప్పలనరసమ్మ.

1886 ఉద్యోగానికి సెలవుపెట్టి డిప్యూటీ కలెక్టర్ ఆఫీస్‌లో హెడ్ క్లర్కు ఉద్యోగం.

1887 కాలేజీలో నాలుగో లెక్చరర్. జీతం నూరు రూపాయలు (విజయ దశమి నాడు)

1887 విజయనగరం మహారాజు ఆనంద గజపతి పరిచయం.

1887 విజయనగరంలో ఒక కాంగ్రెస్ సభలో ఉపన్యాసం.

1887 ప్రథమ సంతానం, కుమార్తె (ఓలేటి లక్ష్మీ నరసమ్మ).

1888 విశాఖపట్టణం స్వచ్ఛంద సేవా దళంలో సభ్యత్వం.

1889 ఆనంద గజపతి ఆస్థానం డిబేటింగ్ క్లబ్బుకు ఉపాధ్యక్షపదవి.

1890 ద్వితీయ సంతానం, కుమారుడు (వెంకట రామదాసు).

1890 గురజాడ "విక్టోరియా ప్రశస్తి" గీతాలు వైస్రాయి దంపతులకు రీవా రాణి డిసెంబరు 12న బహూకరించారు.

1891 మూడవ లెక్చరర్ పదవి. జీతం నూటపాతిక. చెప్పే పాఠాలు, ఎఫ్.ఎ., బి.ఎ., క్లాసులకు ఇంగ్లీషు, వ్యాకరణం, సంస్కృత సారస్వతం తర్జుమా, గ్రీక్, రోమన్ చరిత్రలు.

1892 మద్రాసు లా కాలేజీలో చదువుతూ వుండిన తమ్ముడు శ్యామల రావు మరణం.

1892 "కన్యాశుల్కం" మొదటి కూర్పు ప్రదర్శనం (ఆగస్టు 13).

1894 "శ్రీరామ విజయమ్" అన్న సంస్కృత నాటక సమీక్ష విజయనగరం ఆంధ్రాంగ్ల పత్రిక "తెలుగు హార్పు" లో. ఇది ఆ గ్రంథానికి పీఠికగా ప్రచురింపబడింది. 1912 తరవాత (?) "జార్జిదేవ చరితమ్" లేక "రాజభక్తి ప్రదీపమ్" అన్న యింకో సంస్కృత కావ్యానికి పీఠిక. వీటి రచనా కాలాలు తెలియవు. ఈ పీఠికలన్నీ ఇంగ్లీషులో రాసినవి.

సి. పి. బ్రౌన్ సేకరించిన చారిత్రక గాధ. "ది వార్స్ ఆఫ్ రాజాస్, బీయింగ్ ది హిస్టరీ ఆఫ్ హండె అనంతపురం" (తెలుగు) అన్న ప్రతిని, ముఖతా విని బ్రౌన్ రాయించి పెట్టిన "తాతాచార్యుల కధలు" అన్న సంపుటం సంస్కరించి ప్రచురణకు సిద్ధపరిచారు. అవి చనిపోయాక అచ్చయ్యాయి.

1891 సంస్థాన శాసన పరిశోధక పదవి.

1896 "ప్రకాశిక" అన్న పత్రికకు సంపాదకునిగా డిక్లరేషన్. ఈ పత్రిక వెలువడినట్టు లేదు.

1896 ఆనంద గజపతి భార్య మరణం.

1897 "హరిశ్చంద్ర" అన్న ఇంగ్లీషు నాటకానికి పీఠిక.

1897 "కన్యాశుల్కం" తొలి కూర్పు ఆనంద గజపతికి అంకితం, ముద్రణ. పీఠికలో, గ్రాంధిక భాషలోని అసౌకర్యాలు, యిబ్బందులూ వివరంగా చెప్పి, వాడుక భాషను కావ్యభాషగా పెంపొందించడం వల్ల కలిగే మేళ్లను నొక్కి వక్కాణించడం జరిగింది ఇది సాహిత్య భాషగా వాడుక భాష స్థాపనకు, నవ్య ఆధునిక భాష వ్యాప్తికి అంకురార్పణ.

1897 ఆనంద గజపతి మరణం.

1898 ఆనంద గజపతి అక్క అప్పలకొండయాంబ (రీవా రాణి) ఆంతరంగిక కార్యదర్శి ఉద్యోగం.

1902 తృతీయ సంతానం. కుమార్తె (పులిగెడ్డ కొండయ్యమ్మ)

1903 సంతానం లేకుండా చనిపోయిన ఆనంద గజపతి, తల్లి అలక రాజేశ్వరికి దత్తత చేసుకునే హక్కునిచ్చారు. ఇది చెల్లదని దాయాదులు దావా వేశారు. దావా 1913 వరకూ సాగి రాజీ అయ్యింది ఈ దావాను నడిపించే భారం అంతా గురజాడ మీద పడింది.

1905 తండ్రి మరణం

1906 పాఠశాలల్లో సులభ తెలుగు బోధనా భాష కోసం, తూర్పు జల్లాల విధ్యాధికారి జె. ఏ ఏట్స్‌తోనూ, విశాఖపట్టణం మిసెస్ ఏ.వి.యన్. కాలేజి ప్రిన్సిపాల్ పి. టి. శ్రీనివాసయ్యంగార్‌తోనూ, పర్లాకిమిడి కాలేజి లెక్చరర్ గిడుగు రామమూర్తితోనూ కలిసి కృషి, చర్చలు, వాడుక భాష కోసం మహోద్యమ ప్రారంభం.

1906 "కొండుభట్టీయం" రచన

1907 "నీలగిరి పాటలు" ప్రచురణ.

1908 మద్రాసు కాంగ్రెసు మహాసభలో, దాన్ని గురించి ఇంగ్లీషు పత్రికల్లో వ్యాఖ్యలు, ఆంగ్ల వ్యంగ్య పద్య రచన.

1909 "కన్యాశుల్కం" రెండో కూర్పు ప్రచురణ

1910 ఆకాశంలో తోకచుక్క (హాలీస్ కామెట్) కనిపించగా కలిగిన భయాందోళనలను "చన్నకాలపు చిన్న బుద్ధులు"గా వ్యాఖ్య.

1910 సకల కులాల వారితో బరంపురంతో సహపంక్తి భోజనం.

1910 'ముత్యాల సరములు', 'కాసులు' ప్రచురణ. ఇది మొదలుకొని, ఈ సంవత్సరంలో అనేక అధునిక కవితా గీతాలు, అధునిక కధలు వివిధ పత్రికలలో ప్రచురణ వాడుకభాషకోసం వాదోపవాదాలతో, అనేక వ్యాసాలు కూడా యీ సంవత్సరంలో ప్రచురణ (వివరాలు ఆయా రచనలలో చూడ వచ్చును.) ఈ ఏడే 'బిల్హణీయం' ప్రథమాంకం ప్రచురణ అయ్యింది.

1911 "బిల్హణీయం" ద్వితీయాంకం "లవణరాజు కల" ప్రచురణ.

1911 మద్రాసు విశ్వవిద్యాలయం బోర్ ఆఫ్ స్టడిస్ సభ్యత్వం.

1911 ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపన. (వాడుక భాష ఉద్యమం కోసం.)

1912 కలకత్తా వంగీయ సాహిత్య పరిషత్తు తేనీటి విందు (జనవరి 23).

1912 "కన్యక" ప్రచురణ.

1912 రీవా రాణి మరణం.

1913 వారసత్వం దావా రాజీ.

1913 "సుభద్ర" రచన.

1913 ఉద్యోగ విరమణ, (ఫిబ్రవరి 12). పెన్షన్ రూ. 140.

1913 మద్రాసు విశ్వవిద్యాలయం "ఫెల్లో" పదవి.

1914 మద్రాసు విశ్వవిద్యాలయానికి 'విశ్వవిద్యాలయాలు; సంస్కృత, మాతృభాషలు' అన్న నివేదిక సమర్పణ.

1914 మద్రాసు విశ్వవిద్యాలయం పాఠ్య క్రమంలో వాడుక భాషను చేర్చరాదన్న నిర్ణయానికి అసమ్మతిగా 'అసమ్మతి పత్రం 'సమర్పణ.

1914 అనారోగ్యం.

1914 "దించు లంగరు" రచన.

1915 తన శరీర స్థితిని గురించి, అనారోగ్యం గురించీ వైద్యునికి వివరణ (పంపిన తేది ఏప్రిల్ 9).

1915 "లంగరెత్తుము" రచన.

1915 నూతన గృహప్రవేశం.

1915 నవంబరు 30 మరణం.



HIS HIGHNESS THE MAHARAJA MIRJA SRI ANANDA GAJAPATI RAJ MANEA SULTAN BAHADUR OF VIZIANAGRAM, G.C.I.E.

కృతికర్త, ఆనంద గజపతి

# DEDICATION

To

His Highness the Maharajah Mirja Sri Ananda Gajapati Raj Maharajah Saheb Meherban Mushpak Kadardan Karampharmayi Mokhalesan, Badshah - e - Kaling, Manea Sultan Bahadur of Vizianagram, G C I.E.

MAY IT PLEASE YOUR HIGHNESS,

It is fabled that when the ancient demi-god of your noble race, was making a causeway across the sea, to rescue his consort from captivity, the faithful squirrel brought at the end of its tail, a few grains of sand, not indeed, hoping to advance the high enterprise in any appreciable degree, but to show an inclination to serve. Ten years ago, when the question was engaging Your Highness's attention, of saving a very helpless section of our women-kind, from a galling type of slavery, fraught with the germs of social demoralisation, an humble servant made a feeble effort to arouse public opinion on the subject, by exposing the evil in a popular drama The success that attended its production on the boards, and demand for copies from various quarters, emboldened him to publish it. No one is better aware than the writer himself, how great are the imperfections of the piece, and how unworthy it is of presentation to such an exalted personage and ripe Scholar as Your Highness, but he has ventured to seek Your Highness's indulgence, as he deems it the highest honour and his greatest ambition to be permitted to dedicate the fruits of his intellect, poor though in merit, to a Prince with whom knowledge is an absorbing passion and whose appreciative encouragement of letters, has attracted to his court literary stars of the first magnitude and inaugurated a brilliant epoch in the history of Telugu Literature.

I have the honour to subscribe myself
May it please Your Highness,
One Ever Loyal to The Ever Loyal.

# అంకితం

ఘనత వహించిన మహారాజా మీర్జా శ్రీ ఆనంద గజపతి రాజ్ మహారాజా సాహెబ్ మెహర్బాన్ ముష్ఫక్ కదర్దాన్ కరంఫర్మాయీ మొఖ లెసాన్, బాధ్దా - యె - కళింగ్, మనె సల్తాన్ విజయనగరం బహదూర్ జి సి. ఐ. ఇ. గారికి

ప్రభూ, అవధరించండి,

మీ వున్నత వంశానికి చెందిన పురాతన అవతార పురుషుడు తన సతిని చెరనుంచి విడిపించేందుకు సముద్రంపై వారధి కడుతున్నప్పుడు, స్వామిభక్తి పరాయణమైన ఉడుత తన తోక కొనతోకాస్త ఇసుక రేణువులను తీసుకొచ్చిందని కథ చెబుతారు. ఆ మహత్కార్యానికి తాను ఎక్కువ తోడ్పడ గలనని కాక, తన సేవాతత్పరతను చూపడం ఉడత వుద్దేశం. మన స్త్రీ జాతి లోని నిస్సహాయమైన విభాగాన్ని సమాజ అవినీతి క్రిములతో నిండివున్న బాధాకరమైన దాస్యం నుండి రక్షించే సమస్య, ఘనత వహించిన మీ దృష్టిని పదేళ్ళక్రితం ఆకర్షించినప్పుడు, ఈ చెడుగును ఒక జనరంజమైన నాటకంలో వెల్లడిచేసి ఈ విషయంపై ప్రజాభిప్రాయాన్ని వుద్దీప్తం చేసేం దుకు మీ భృత్యుడొకడు ఒక దుర్బల ప్రయత్నం చేశాడు. ఆ నాటక ప్రదర్శన విజయవంతం కావడం,'దాని ప్రతులు కావాలని వివిధ ప్రాంతాల వారు కోరడం చూచి, అతను నాటకాన్ని ప్రచురించే ధైర్యం చేశాడు. ఈ నాటకంలో ఎంత పెద్ద లోపాలున్నాయో, ఘనత వహించిన మీ అంతటి ఉన్నత వ్యక్తికి, పరిణత విద్వాంసునికి కాన్కగా సమర్పించడానికి అది ఎంత అనర్హమైనదో అందరికన్న రచయితకే బాగా తెలుసు. అయినప్పటికీ, అతను తన కోర్కెను దయతో మన్నించవలసిందిగా ఘనత వహించిన మిమ్మల్ని ప్రార్థిస్తున్నాడు. ఎందువల్లనంటే, జ్ఞానార్జన మైమరపించే పిపాసగా వున్నట్టి, గుణగ్రహణ శీలమైన సాహిత్యపోషణతో తన కొలువు కూటానికి, తారాపదమందుకొన్న అగ్రేసర సాహిత్య శిఖామణులను ఆకర్షించి, తెలుగు సాహిత్య చరిత్రలో ఒక మహోజ్జ్వల శకానికి నాంది పలికినట్టి ఒక రాకు మారునికి, అల్పమైనదైనా, తన మేధఃఫలాలను అర్పించడానికి అనుమతింప బడటమే అత్యున్నత గౌరవంగా, తన మహదాశయంగా అతను భావిస్తు న్నాడు.

ఘనత వహించిన సదా విధేయునికి సదా విధేయుడుగా వుండే గౌరవానికి నోచుకొన్న భవదీయుడు.



# KANYASULKAM.

A TELUGU COMIC PLAY IN FIVE ACTS.

G. V. APPAROW PANTULU B. A.

Epigraphist, to H. H the Maharajah

of Vizinnagram.

మొదటి కూర్పు (1897) ముఖపత్రం

శ్రీరస్తు

# కన్యాశుల్కము

ఇది

శ్రీ విజయనగర రాజ్యమున ప్రాచీనలిపిపాఠకుడగు

గురజాడ, అప్పారావు పంతులు బి. ఏ. చే

రచియింపబడినది.

శ్రీవిజయనగరము

శ్రీవిజయరామవిలాస ముద్రాక్షరశాలయందు,

కొంకిపూడి, భద్రయ్యచే ముద్రింపబడి

ప్రకటింపఁబడియె.

౧౮౯౭ సం॥రం.



దీని వెల ౮ అణాలు. అంచెకూలి ౧ అణా.

మొదటి కూర్పు లోపలి తొలి పుట

# PREFACE

Under the orders of His Highness the Maharajah of Vizianagram, a list was prepared ten years ago, of Brahmin *sulka marriages* celebrated in the ordinary tracts of the Vizagapatnam District during three years. The list is by no means exhaustive as the parties concerned were naturally averse to admitting acceptance of bride-money; but such as it is, it forms a document of great value and interest. The number of marriages recorded reached one thousand and thirty four, giving an average of three hundred and forty four, for the year. Ninety nine girls were married at the age of five years, forty four at four, thirty six at three, six at two, and three at the age of one;— the babies in the last instance carrying a price of from three hundred and fifty to four hundred rupees a head. Strange, as it may sound, bargains are sometimes struck for children in the womb. Such a scandalous state of things is a disgrace to society, and literature cannot have a higher function than to show up such practises and give currency to a high standard of moral ideas. Until reading habits prevail among the masses, one must look only to the stage to exert such healthy influence. These considerations prompted me to compose **Kanyasulkam**

I clothed the play in the spoken dialect, not only that it is better intelligible to the stage-going public than the literary dialect, but also from a conviction that it is the proper comic diction for Telugu. Dramatic style is, no doubt, determined to some extent by usage, but the absence of any real dramatic literature in Telugu, leaves a writer free to adopt that outward form which he deems most appropriate for the persentation of his ideas. The metres in use in Telugu, with their alliterative restrictions, are incapable of imparting to language conversational ease which is indispensable in a comedy, or *continuity* in which, as Mr. Ward remarks, lies real life. One might invent new dramatic measures—but it would be a superfluous task, so far at least as comedy is concerned, as prose is gaining ground all over the world for dramatic purposes.

It has been remarked that the use of what is wrongly termed the *vulgar tongue* mars the dignity of a literary production, but that is a piece of criticism which one need not heed at the present day when the progress of the Science of Language has established better standards for judging the quality and usefulness of tongues than the whims of Grammarians of old linguistic strata. The Telugu literary dialect contains many obsolete grammatical forms, an inconveniently large mass of obsolete words and arbitrary verbal contractions and expansions, necessitated by a system of versification based on alliteration and quantity. A license, which, no doubt, has its own advantages, of introducing Sanskrit words to any extent has been but too eagerly availed of by poets who brought glossaries into requisition, revelled in fantastic compound - fornation, and made the Telugu literary dialect *doubly dead.* This is not the place to dilate on the question of linguistic reform , but thus much might be said—if, it is intended to make the Telugu literary dialect a great civilizing medium, it must be divested of its superfluous obsolete and Sanskrit elements, and brought closer to the spoken dialect from which it must be thoroughly replenished. There is not much dialectical difference in the Telugu generally spoken in the various parts of the Telugu Country, thanks to the conservative instincts of the people , so a new common literary dialect can be established with comparative ease, if only able writers set about it in right earnest.

Recently, I happened to read **Brahmavivaham** by Rai Bahadur Viresalingam Pantulu garu and found that there were some parallel passages in our plays, a thing perfectly natural considering that his piece traversed the whole field of Brahmin marriages. But it will be seen that these plays have little else in common, our treatment being essentially different. **Brahmavivaham** was meant to be a pure comedy of manners, while in **Kanyasulkam** humour, characterization and the construction of an original and complex plot have been attempted—with what success, it is for the public to judge.

# పీఠిక

## (మొదటి కూర్పు ఇంగ్లీషు పీఠికకు అనువాదం)

విశాఖపట్నం జిల్లా సామాన్యప్రాంతాల్లో మూడేళ్ళల్లో జరిగినబ్రాహ్మణ కన్యాశుల్క వివాహాల పట్టీని పదేళ్ళక్రితం, ఘనత వహించిన విజయనగరం మహరాజు గారి ఉత్తర్వుపై తయారు చేశారు. కన్యాశుల్కం తీసుకొన్నట్లు ఒప్పుకోవడానికి అందుకు సంబంధించిన వ్యక్తులు సిద్ధంగా లేనందువల్ల (ఇది సహజమే) ఈ పట్టీ అసమగ్రం కాని తయారయిన పట్టీ సైతం ఎంతో విలువైన ముఖ్యమైన పత్రం. నమోదయిన ఈ వివాహాల సంఖ్య 1034, అంటే సగటున ఏడాదికి ఇటువంటి వివాహాలు 344 జరిగాయన్న మాట. 99 మంది పిల్లలకు ఐదేళ్ళ వయసులో, 44 మందికి నాలుగేళ్ళ వయసులో, 36 మందికి మూడేళ్ళ వయసులో, ఆరుగురికి రెండేళ్ళల్లో, ముగ్గురికి ఏడాదిలోనే పెళ్ళి చేశారు! ఏడాది శిశువులు ఒక్కొక్కరికి చెల్లించిన ధర 350-400 రూపాయలు, చిత్రమనిపించవచ్చు కాని, కొన్ని సందర్భాల్లో కడుపులోవున్న పిల్లలకు కూడ బేరం కుదుర్చుకొన్నారు! ఇంతటి ఘోరమైన పరిస్థితి సమాజానికి సిగ్గుచేటు ఇటువంటి దురాచారాన్ని ఎండగట్టి, ఉన్నతమైన నైతిక ప్రమాణాలను వ్యాపింపచేయటానికి మించిన కర్తవ్యం సాహిత్యానికి మరొకటి లేదు. ప్రజాబాహుళ్యానికి పుస్తక పఠనం అలవాటయ్యేదాకా అలాంటి ఆరోగ్యకర ప్రభావ వ్యాప్తికై నాటకరంగాన్ని ఆశ్రయించవలసి వుంటుంది. కన్యాశుల్కం నాటక రచనకు నన్ను ప్రేరేపించినది ఇదే

నేను ఈ నాటకాన్ని వాడుక బాషలో రాశాను. ఎందువల్లనంటే ఇది గ్రాంధిక భాషకన్న నాటకాలు చూసే ప్రజలకు బాగా అర్థమవుతుందనే కాక, ఇది హాస్యరసానికి తగినదని నా నిశ్చితాభిప్రాయం నాటకశైలిని కొంత వరకు నిర్ణయించేది మునుపటి వరవడి అనేది నిజమే. కాని, తెలుగులో నిజమైన నాటక సాహిత్యం లేనందువల్ల తన భావ ప్రకటనకు అత్యున్నతమైనదనుకొన్న బాహ్యరూపాన్ని ఎంచుకొనే స్వేచ్ఛ రచయితకు వుంది తెలుగులో వాడుతున్న చందస్సులు యతిప్రాసాది ప్రతిబంధకాలు, భాషకు సంభాషణా సౌలభ్యాన్ని ఇవ్వలేవు, మరి అటువంటి సౌలభ్యం సుఖాంత నాటకానికి, మిస్టర్ వార్డ్ అన్నట్లు, వాస్తవజీవితంలో అంతర్లీనంగావున్న పారంపర్యతకు తప్పనిసరి, నాటకాలకోసం కొత్త చందస్సులను సృష్టించుకోవచ్చు. కాని కనీసం సుఖాంత నాటకాలకు సంబంధించినంత వరకు, అది అనవసర శ్రమ. ఎందువల్ల నంటే, ప్రపంచ మంతటా నాటక రచనకు వచనాన్నివాడటం అంతకంతకు ఎక్కువవుతోంది.

గ్రామ్యభాష అనే తప్పుడు పేరుతో పిలిచే భాషను వాడటం వల్ల సాహిత్య రచనల ఔన్నత్యం మంటగలుస్తుందని కొందరంటున్నారు. కాని నేడు భాష గుణగణాల్ని, ప్రయోజనాన్ని అంచనా కట్టేందుకు, పాత కాలపు పండితులైన వైయాకరుణల పైత్యాల కన్న వుత్తమ ప్రమాణాలు, భాషా శాస్త్ర ప్రగతి పుణ్యమా అని నెలకొన్నాయి అందువల్ల ఇటువంటి విమర్శను మనం ఖాతరు చేయవలసిన పనిలేదు తెలుగు గ్రాంథిక భాషలో, కాలం చెల్లిన ఎన్నో వ్యాకరణబద్ధ రూపాలు, ఇబ్బంది పెట్టేటంత విస్తారంగా వాడుకలో లేని పదజాలం, గణ, యతి, ప్రాస నియమాలపై ఆధారపడిన పద్య రచన కోసం ఇష్టమొచ్చినట్లు క్రియాపదాలకు చేసిన కుదింపులూ, విస్తరణలు కోకొల్లలుగా వున్నాయి. సంస్కృత పదాలను నిరవధికంగా ప్రవేశపెట్టే స్వేచ్ఛను (అయితే, దీనివల్ల కొన్ని అనుకూలాలు వున్నమాట నిజమే) కవులు అవురావురుమని వినియోగించుకొని, నిఘంటవులను ఆశ్రయించ వలసిన అవసరం కల్పించారు; అనూహ్యామైన దీర్ఘసమాసాలను పరవళ్ళు తొక్కించారు. ఇలా గ్రాంధిక భాషను రెండు విధాలా మృతభాషగా చేసివేశారు. భాషా సంస్కరణ సమస్యను గురించి చర్చించడానికి ఇది అదను కాదు, కాని ఒక విషయం చెప్పవచ్చు: తెలుగు సాహిత్యభాషను నాగరికతా వ్యాప్తికి ఒక గొప్ప సాధనంగా చేయాలంటే, దాన్ని వ్యావహారిక భాషకు దగరగా తీసుకు రావాలి, దానిని పూర్తిగా వినూత్నం చేయాలి. తెలుగు దేశంలోని వివిధ ప్రాంతాల్లో మామూలుగా మాట్లాడే తెలుగు బాషలో పాతుకొని పోయివున్న ప్రజల అలవాట్లవల్ల మాండలిక భేదాలు పెద్దగా లేవు. సమర్థులయిన రచయితలు గట్టిగా పూనుకుంటే, ఒక కొత్త ఉమ్మడి సాహిత్యభాషను సులభంగానే రూపొందించవచ్చు

రాయ్‌బహద్దూర్ వీరేశలింగం పంతులుగారి బ్రాహ్మ వివాహం ఇటీవల నేను చదవటం తటస్థించింది మా వుభయుల నాటకాల్లో ఒకే విధమైన భావాలున్నాయని గమనించాను. ఆయన నాటకం బ్రాహ్మణుల పెళ్ళిళ్లకు సంబంధించిన వ్యవహారాన్నంతటినీ స్పృశించడం వల్ల ఇది సహజమే, కాని ఇది తప్ప, ఈ నాటకాల మధ్య మరే సామ్యమూ లేదు. విషయావలోడన పూర్తిగా భిన్నమైనది బ్రాహ్మ వివాహం కేవలం అలవాట్లను, ఆచారాలను ఎద్దేవ చేసే ప్రహసనం. కన్యాశుల్కంలోనేమో, హస్యం, పాత్రల చిత్రీకరణ, జటిలమైన ఒక కొత్త కథాసంవిధానం కోసం ప్రయత్నించాను — ఇందులో ఎంతవరకు కృతకృత్తుణ్ణయానో లోకం నిర్ణయించాలి.

# Some Press Opinions on the First Edition.

......Mr. Appa Row is, apparently, a man of original ideas in literary matters . . He has wisely and happily discarded for the purposes of his comedy the unnatural. stilted, pedantic, literary dialect so much beloved of Telugu Pandits, and so unduly prized by them and employed. Instead the simple, ordinary language of common life now in use among all classes of the population in the Northern districts of this Presidency. The book, therefore, marks a new and bold departure in Telugu dramatic composition or for the matter of that, in Telugu composition in general The literary tendencies of the present time running, as they do, in such a narrow groove, and being of so stereotyped a character, it speaks very highly, we think, for our author's literary ourage, a courage bordering on audacity, that he has been able to set at naught the absurd litarary canons of this degenerate age and risen above the prevalent grammatical and literary superstitions in regard to Telugu composition. But not only has he thus boldly used a new literary diction which though unsanctifide by existing usage among authors, bears the stamp and seal of popular approval and universal use. But he has likewise shown unmistakable merit in constructing a singularly original and interesting plot and creating a variety of characters true to life, which we are sure, if represented on the stage, will greatly please any Telugu audience, let alone the reading public who may peruse the drama in the retirement of the study or the library. We have therefore, much pleasure in recommending "Kanyasulkam" to all our Telugu readers. ... The characters are all boldly drawn and the whole piece is very happily put together and artistically constructed, evincing no little originality and dramatic skill on the part of the author. *The People's Friend, January 21, 1897*

*Kanyasulkam* ought to be widely read. It is very agreeable reading— and we have read it almost at one sitting. But the naturalness of expression and the skill of plot are the least of its merits It holds the mirror up to nature . ..... Such is the plot of Kanyasulkam. And what scope it affords for the representation of indian charactor in its various aspects, needs scarcely to be pointed out. Nor has Mr. Appa Row wasted his opportunities..... *The Weekly Review, March 27, 1897.*

The piece, besides displaying much incident and humour, posseses the very necessary element of characterization a trait often conspicuous by its absence in our old plays — *The Telugu Harp*

The play has been acted several times, and judging from the large audience which crowded the theatre on each occasion, the author must be congratulated upon the success which the exhibition of his work produced —The East Cost News.

The plot is well concieved and skillfully worked out The characters are all aptly chosen - The Indian Journal of Education.

Mr Appa Row deserves to be congratulated - The Indian Social Reformer.

It is full of wit and humour and falls in with the spirit of the

times The dialogue is lively and very interesting and we have nothing but praise and admiration for the author— Dhimani.

Its story which is very humourous inculcates wholesome moral lessons.
—*Bilika*

The predominating Rasa (emotion) in the play is humour A careful study of the book is sure to bring home to the mind of the reader the need for social reform As the author mentions in his preface, this work has been written on lines different from *Brahma Vivaha* and other social reform dramas ..... May this work which has been composed for the good of the people, put an end to some of the evils in the country .... May this work which is intelligible to the masses, spread all over the country and help the cause of Social Reform — *Chintaman* .



## మొదటి కూర్పుపై కొన్ని పత్రికల అభిప్రాయాలు

(తెలుగు అనువాదం)

... శ్రీ అప్పారావు సాహిత్య విషయాల్లో తనవైన సొంత భావాలున్న వ్యక్తి అని స్పష్టమవుతోంది ... తన సుఖాంత నాటక రచనకు ఆయన, తెలుగు పండితులకెంతో ప్రీతిపాత్రమై, వారి మితిమీరిన పొగడ్తలందుకొంటున్న గ్రాంధిక భాషను, కుంటుకొంటూ నడిచే అసహజమైన, శుష్క పాండిత్య ప్రదర్శకమైన ఆ భాషను వదలివేసి, దానికి మారు ఆయన ఈ రాష్ట్రంలోని ఉత్తర సర్కార్ జిల్లాల జనాభాలోని అన్ని వర్గాల్లో నేడు వాడుకలో వున్న సరళమైన భాషను, మామూలు జీవితంలోని సర్వసామాన్యమైన భాషను ఉపయోగించారు. కాబట్టి ఈ పుస్తకం తెలుగునాటక రచనలో, ఆ మాట కొస్తే, మొత్తం తెలుగు సాహిత్య రచనలోనే సాహసోపేతమైన ఒక కొత్త పోకడ . ప్రస్తుతకాలంలో సాహిత్య ధోరణులు అంత సంకుచితమైన జాడననుసరిస్తూండటం, అంత చర్విత చర్వణంగా వుండటం చూస్తే ఈ రచయిత ఈ క్షీణయుగంలోని అర్థంపర్థం లేని సాహిత్య సూత్రాలను ఖాతరు చేయకుండా, తెలుగు రచన విషయంలో వ్యాకరణ, సాహిత్య సూత్రాలపై పాతుకొని పోయిన మూఢభక్తికి అతీతంగా వ్యవహరింప గలగడం సాహితీరంగంలో ఆయన ధైర్యానికి - మహాసాహస మనదగిన ఆయన ధైర్యానికి సాక్ష్యమని మా అభిప్రాయం ఇంతే కాదు ; రచయితలు ప్రస్తుతం వాడే భాష అంగీకరించక పోయినప్పటికీ, ప్రజల ఆమోదముద్రనూ వాడుకవల్ల సర్వజనానుమతిని పొందిన ఒక కొత్త రచనా శైలిని రచయిత ఇలా ధైర్యంగా వాడారు. అదేవిధంగా ఆయన, ప్రత్యేకించి స్వతంత్రమైన, ఆసక్తికరమైన కథా సంవిధానంలో, వాస్తవజీవితానికి అద్దం పట్టే బహువిధ పాత్రలను సృష్టించడంలో నిస్సందేహమైన ప్రతిభ చూపారు. ఈ నాటకాన్ని తీరికగా తమ యింట్లో, లేదా గ్రంథాలయంలో చదువుకొనే వారి మాట అటుంచండి ; రంగస్థలంపై ప్రదర్శితమైన ఈ పాత్రలు తెలుగు ప్రేక్షకుల్ని ఎంతో ఆనందింపచేస్తాయి కాబట్టి, కన్యాశుల్కం చదవదగిన

పుస్తకమని మా పాఠకులందరికీ చెప్పడానికి మేమెంతో సంతోషిస్తున్నాము. వీటిలోని పాత్రచిత్రణ ధైర్యోపేతమైనది. మొత్తం నాటకానికి ఒక చక్కని సమగ్రత ఉంది; దాని నిర్మాణం కళాత్మకంగా వుంది. ఇవన్నీ రచయిత ఉపజ్ఞను నాటక రచనా నైపుణ్యాన్ని ప్రస్ఫుటం చేస్తున్నాయి —ది పీపుల్స్ ఫ్రెండ్, 1897, జనవరి 21.

కన్యాశుల్కం అందరూ చదువవలసిన పుస్తకం. చాలా హాయిగా చదువుకోవచ్చు- మేము దాదాపు విడవకుండా ఒకే విడతలో చదివాము. కాని, సహజమైన సంభాషణలు, కథావిష్కరణ నైపుణ్యం వున్నా, అవి దాని విశిష్ట గుణాల్లో ముఖ్యమైనవి కావు. ఈ నాటకం మానవ ప్రకృతికి అద్దం పడుతోంది. కన్యాశుల్కం కథ అదీ అన్నమాట. భారతీయ శీలంలోని బహుముఖాలను చిత్రించడానికి ఇది ఎంత అవకాశమిచ్చిందో ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు శ్రీ అప్పారావు ఈ అవకాశాలను వృధా చేయలేదు. - ది వీక్లీ రెవ్యూ, 1897 మార్చి 27.

ఈ నాటకం ఎన్నో సన్నివేశాలను చూపుతూ హాస్యరస స్ఫోరకంగా వుండటమే గాక, పాత్ర చిత్రీకరణకు అవసరమైన అంశాలను తనలో ఇముడ్చుకొంది. మన పాత నాటకాల్లో తరచు లోపించిన లక్షణమిదే — ది తెలుగు హార్ప్.

ఈ నాటకాన్ని ఎన్నో సార్లు ప్రదర్శించారు. అటువంటి సందర్భాల్లో నాటకశాల ప్రేక్షకులతో క్రిక్కిరిసేది దీన్నిబట్టి ఈ నాటక ప్రదర్శన విజయవంతమైనదని నిర్ణయించవచ్చు. ఇందుకు రచయితను అభినందించి తీరాలి —ది ఈస్ట్ కోస్ట్ న్యూస్

ఈ నాటకంలోని కథకు, బాగా ఆలోచించి రూపుదిద్దారు. పాత్రలను ఎంచుకోవడంలో ఎంతో నైపుణ్యం వుంది. — ది ఇండియన్ జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషన్

శ్రీ అప్పారావు అభినందనార్హులు - ది ఇండియన్ సోషల్ రిఫార్మర్.

ఇది ఛలోక్తులతో హాస్యంతో, అలరారుతూ, మన కాల సరళిని పుణికి పుచ్చుకొంది సంభాషణలు చకచక నడుస్తూ ఎంతో ఆసక్తిదాయకంగా వున్నాయి ఈ రచయితను మనస్ఫూర్తిగా ప్రశంసిస్తున్నాము; మెచ్చుకొంటున్నాము — ధీమణి.

హాస్య రసం పొంగులు వారే ఈ కథ నీతుల్ని బోధిస్తుంది.—బాలిక.

ఈ నాటకంలోని ప్రధాన రసం హాస్యం ఈ పుస్తకాన్ని జాగ్రత్తగా చదివితే, పాఠకుని మనసులో సమాజ సంస్కరణ అవసరమన్న యదార్థం నాటుకొంటుంది. రచయిత తన పీఠికలో చెప్పినట్లు ఈ నాటకాన్ని, సమాజ సంస్కరణను వుద్దేశించి రాసిన బ్రాహ్మ వివాహం మొదలయిన నాటకాలకు భిన్నమైన ఫక్కీలో రాశారు ప్రజల మంచి కోసం రాసిన ఈ నాటకం దేశంలోని కొన్ని చెడుగులను తుడిచి పెట్టుగాక.. ప్రజా సామాన్యానికి సుబోధకంగా వున్న ఈ నాటకం దేశమంతా ప్రాచుర్యం పొంది, వ్యాపించి సమాజ సంస్కరణోద్యమానికి తోడ్పడుగాక—చింతామణి.

# నాందీ

## (సంస్కృత మూలం)

శ్రేయో దేయా త్పరమపురుషః పావనః పాపహారీ
దూరీభూతాగ్రహలవతయా నిర్భయం చింతనీయః
సద్వాఽసద్వా య ఇద మఖిలం సృష్టవా నిచ్ఛయాదౌ
నిస్సంగాయే నిఖిల మవధూయాంతరాస్వాదయంతే.

నాంద్యంతే సూత్రధారః

కాలోఽసౌ చామరాణాం భువిభువి విపణై ర్విస్తృణాతీవ కాశై
రారణ్యక్షత్రపానాం (మతితరళ) ఘనా శ్చాతపత్రాణి శుభ్రాః
ప్రాగుద్రేకేణ గత్వా స్ఫుట మతిబవినా సంగమే మద్యమానాః
పారావారేణ కార్శ్యం సరిత ఉపగతా మందమందం వహంతే.

(సభా ముద్దిశ్య)

చిత్రైః ప్రాసాదశృంగై ర్మకుటగణ మివ స్వీయశీర్షేషు ధత్తే
జాలద్వారాదిబద్ధై స్తరళరుచిఘనై ర్దర్పణైః పశ్యతీవ
క్లిష్టా స్వర్నిర్ఝయేనే త్యల మివ మరుతా వీజ్యతే యా ధ్వజాగ్రై
రంభోధే ర్నాతిదూరే విజయనగరనా మ్న్యస్తి సా రాజధానీ.

కించ తస్యాం చ రాజధాన్యా మాంగ్లేయవైద్యక విరచిత విమల వివిధౌషధ సుసమృద్ధా వైద్యశాలాః, ఆంగ్లేయ భాషా మహాపాఠశాలాః, సర్వ కళాశిల్పశాలాః, బాలికాపాఠశాలాః, సంగీత నాట్యాదిస్థానాని, దీనజనరక్షార్థం పరికల్పితా అన్నశాలాః, తదా తదా విజ్ఞేయవిశేషాంశోపన్యా సోచిత సభా స్థానాని, ద్రష్టవ్యప్రదేశాశ్చ బహూని చ రమ్యాణి రాజోద్యానాని, బహూ న్యతివిమలాని రాజభవనాని, అశ్వరథగజపదాతం నానాయుధవాహినీ సఖేయ మశిదిల చతుష్కూటు మశ్మదుర్గం, విచిత్రాణి చ యంత్రాణి సంతి తా మధి తిష్ఠ న్నసౌ వానందగజపతి ర్నామ మహరాజోఽయ మపూర్వః పరిదృశ్యతే తథాహి —

సామాన్యేన రాజభి రాశాస్యమానే తు కేవల ధనే అనేన గ్రంథ ధన మపార మాశాస్యతే. ఏవ మన్యై రాష్ట్రై కేవలే శ్రద్ధయా పరిశీల్యమానే

---

కన్యాశుల్కం మొదటిసారి 1892 ఆగష్టు 13 న ప్రదర్శన జరిగి నప్పుడు చదివిన నాందీ ప్రస్తావన రచన, ముడుంబై వరహానరసింహ స్వామి. పరనం మేడేపల్లి వెంకటరమణాచార్యులు.

విద్యారాష్ట్ర మనవరత మవలోక్యతే. తథేతరై ర్బాహ్యాశత్రుషు నిరస్య మానేషు అనే నాంతశ్శత్రవో నిరస్యంతే.

అస్య నికటే శ్రుతిస్మృతీతిహాస పురాణాగమవేదినో ధర్మోపదేష్టారః షడ్దర్శన నిపుణాః నిరూపకాః, కావ్యాలంకార ప్రపంచచారిణః, సాహిత్య పరాః, కవయో, మహాకవయో, గాయకా, దైవజ్ఞాః, సంస్కృత వివిధ నాటక ప్రయోక్తారో నాటకినశ్చ సంతి. కిం చ ఆంగ్లేయ పాఠశాలాధికృతా ఇతరే చ ఆంగ్లేయ విద్యాశాలినః ప్రాప్తోత్తమ పరీక్షాప్రశస్తిపత్రాః పరం నిపుణా విప్ర ప్రచురా విద్వాంస ఏనం సేవంతే. తేష్వేకోఽయ మాంగ్లేయ భాషాకవి ర్గురజాడ వేంకటప్పారాయ నామా షేక్స్పియర్ మోలియర్ బెన్ జాన్సన్ ఇత్యాది మహాకవి గ్రంథ నిరంతర పఠనాదరీ ఆంగ్లేయ నాటకక్రమ మాంధ్రే వ్యవతారయితుం కుతుకీ, ఆంధ్రేఽపి గ్రంథ భాషాయా అగ్రాంధిక ద్రష్టృ జనాబోధ్య స్వభావ ప్రయోగతయా తా ముపేక్ష్య స్వభావ ప్రయోగయోగ్యా మానుభావికీం కేవల వ్యవహారరూపాం ఆంధ్రభాషా మాదాయ ఆంగ్లేయా మేవ నాటక పద్ధతి మవలంబ్య కన్యాశుల్కం నామ నాటక మకార్షీత్. తద్వయం. ప్రయోక్తు మార భామహే. అనుమతి మనుగృహ్ణంతు మహాంతో భవంతః

## సంగ్రహ శ్లోకాలు

అన్యై శ్చ పార్థివై ర్యత్ర కాంక్ష్య మాణే పరం ధనే
అనేన కాంక్ష్యతే రాజ్ఞా నానా గ్రంథధనం మహత్.

పాల్యతేఽ న్యై ర్న్య రాష్ట్రంవిద్యారాష్ట్ర మనేన తు
అంతశ్శత్రు నిహంతాయం బహిశ్శత్రు హరాః పరే.

పండితై స్సేవ్యతే నిత్యం నానాశాస్త్ర విచక్షణైః
ఉపాస్యతే తథాంగ్లేయ విద్యావద్భిరయం విభుః

ఆంధ్రేఽపి సంఘటయితు మాంగ్లేయం నాటకక్రమమ్
అగ్రాంధికీ మాంధ్రభాషా మాదాయ సుఖబుద్ధయే

కన్యాశుల్క ప్రహసన మకార్షీ ద్రూపకం మహత్
వ్యాసవంశ జగన్నాథ సహాయోపచితా వయమ్

# వాంది

## (తెలుగు అనువాదం)

మోహబంధాలు లేక నిస్సంగులైనవాళ్లు సర్వస్వాన్నీ పరిత్యాగం చేసి ఎవనిని తమ మనస్సులలో నిలుపుకొని ఆనందాన్ని పొందుతారో, ఎవడు తన సంకల్ప మాత్రాన సదసదాత్మకమైన ఈ ప్రపంచాన్ని ఆదిలో సృజించాడో, అగ్రహమనేది లవలేశమూ లేకుండా చేసికొని నిర్భయంగా చింతింప తగినవా డెవడో, పావనుడై పాపాలను హరియించేవా డెవడో ఆ పరమ పురుషుడు శ్రేయస్సును ప్రసాదించును గాక!

(నాంద్యంతంలో సూత్రధారుడు ప్రవేశించి)

ఈ శరద్వేళ, విరబూసిన రెల్లుపువ్వుల వల్ల ఎల్లెడలా వింజామరల అంగళ్లను పెట్టినట్లున్నది. అరణ్యాలలో నివసించే క్షత్రపులకు, తరళతరంగా మెరిసే మేఘాలు వెల్ల గొడుగులను పడుతున్నట్లున్నది. ప్రథమోద్రేకంతో పరుగులెత్తిన నదులు గొప్ప బలవంతుడైన సముద్రునితో సంగమించి మథింపబడినవై నెమ్మది నెమ్మదిగా కృశత్వాన్ని పొందుతున్నాయి.

(సభను ఉద్దేశించి)

చిత్రంగావున్న సౌధశిఖరాలనే కిరీటాలను ఏ రాజధాని తన శిరస్సులపై ధరిస్తున్నట్లుగా ఉన్నదో, గవాక్షాలూ ద్వారాలూ మొదలైన చోట్ల అలంకరించిన కాంతిమంతాలైన అద్దాలనే కన్నులుగా చేసికొని చూస్తున్నట్లుగాను, స్వర్గనగరంతో పోటీపడి దాన్ని జయించి అలసిపోవడంవల్ల వాయువు వల్ల ఎక్కడి ధ్వజశిఖలు వీచబడుతూ ఉంటాయో, ఆ విజయనగరమనే పేరుగల రాజధాని సముద్రానికి అనతి దూరంలోనే ఉన్నది.

అంతేకాక ఆ రాజధానిలో ఆంగ్లేయ వైద్యులు తయారుచేసిన ఔషధాలు సమృద్ధిగా ఉన్న వైద్యశాలలు, ఆంగ్లేయ భాషను బోధించే గొప్ప పాఠశాలలు, సకలకళలు నేర్పే శిల్పశాలలు, బాలికా పాఠశాలలు, సంగీత నాట్యాలకు ప్రదర్శన కేంద్రాలు, పేదల కోసం కట్టించిన అన్న సత్రాలు అప్పుడప్పుడు జరుగుతుండే సభలూ సమావేశాలకు తగిన మందిరాలు, చూడదగిన రమ్య ప్రదేశాలు, ఎంతో అందమైన రాజోద్యానాలు, ఎన్నో అతి విమలమైన రాజభవనాలు, వివిధాయుధాలతో కూడిన చతురంగ బలం కలిగిన చవికెలూ, రాతి కోట, చిత్ర విచిత్రాలైన యంత్రాలు ఉన్నాయి. దానిని రాజధానిగా చేసికొని పరిపాలించే ఆనందగజపతి మహారాజు అపూర్వంగా భాసిస్తున్నాడు.

సామాన్యంగా రాజులు ధనాన్ని మాత్రమే ఆశిస్తుండగా ఈ ప్రభువు మాత్రం అపారమైన గ్రంథ ధనాన్ని అపేక్షిస్తాడు. తక్కిన రాజులు శ్రద్ధతో ఏదో తమ రాష్ట్రాన్ని మాత్రమే కాపాడుకొంటూ ఉండగా ఈయన ఎల్లప్పుడూ విద్యా రాష్ట్రాన్నే గమనిస్తూ ఉంటాడు. అన్యరాజులు బాహ్యశత్రువులను జయిస్తూ ఉండగా ఈయన అంతశ్శత్రువులను జయిస్తాడు.

ఈ మహారాజు ఆస్థానంలో శ్రుతులు స్మృతులు ఇతిహాసాలు పురాణాలను తెలిసినవారూ, ధర్మశాస్త్రాలను సమన్వయించి చెప్పేవారూ, షడ్దర్శనాలనూ నిపుణంగా విశదీకరించేవారు, కావ్యాలంకార సాహిత్య వేత్తలూ, కవులు, మహాకవులు, గాయకులు, దైవజ్ఞులు (కర్మస్వరూపం తెలిసినవారు), వివిధ సంస్కృత నాటకాలను ప్రదర్శించే నటులూ ఉన్నారు. ఆంగ్లేయ పాఠశాలలోను, ఇతరచోట్లా పనిచేసే ఆంగ్లవిద్యా ప్రవీణులూ, ఆ భాషలో ఉన్నత పరీక్షల్లో ఉత్తీర్ణులై పట్టాలను పొందినవారూ, నిపుణులూ అయిన విప్రులు మొదలుగా పెక్కుమంది విద్వాంసులు ఆనంద గజపతి మహారాజా వారిని సేవిస్తూ ఉన్నారు. అటువంటి ఆంగ్ల విద్యావేత్తల్లో ఒకడూ, కవీ ఆంగ్లంలో షేక్స్‌పియర్, మోలియర్, బెన్‌జాన్సన్ మొదలైన మహకవుల గ్రంథాలను నిరతమూ ఆదరంగా పఠించేవాడూ, ఆ ఇంగ్లీషు నాటకాల సరణిని తెలుగులోకి అవతరింప జేయాలన్న కుతూహలం కలవాడూ అయిన గురజాడ వెంకట అప్పారావు తెలుగులో గ్రాంధిక భాష ప్రేక్షకులకు సులభంగా బోధపడేది కాదని గుర్తించి, స్వభావ ప్రకటనకు అనుకూలమైన వ్యావహారిక భాషనే గ్రహించి, ఇంగ్లీషు నాటక పద్ధతిని అవలంబించి కన్యాశుల్కమనే నాటకాన్ని రచించారు. దానిని మేమిప్పుడు ప్రదర్శిస్తున్నాము. పూజ్యులైన మీరందరూ అనుమతింతురు గాక!

ఇతర రాజు లందరూ మిక్కుటంగా ధనాన్నే కోరుతూ ఉండగా ఆనంద గజపతి ప్రభువు పెక్కు గ్రంథాలనే సంపదనే ఆకాంక్షిస్తాడు.

అన్య రాజులు తమ రాజ్యాన్ని పాలిస్తే, ఈయన విద్యా రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు వారు బాహ్య శత్రువులను జయిస్తే ఆనంద గజపతి ప్రభువు అంతశ్శత్రువులను జయించాడు.

అనంద గజపతి ప్రభువు నిత్యమూ అనేక శాస్త్ర విదులైన పండితుల చేతనూ, ఆంగ్ల విద్వాంసుల చేతనూ సేవింపబడుతూ ఉన్నాడు.

ఆంగ్ల నాటక సరణిని తెలుగులో ప్రవేశపెట్టి, సులభగ్రాహ్యమని వ్యావహారికాన్ని స్వీకరించి గొప్ప రూపకమైన కన్యాశుల్కమనే ప్రహసనాన్ని రచించాడు. ఈయనకు వ్యాసవంశం వాడైన జగన్నాధం సహకారిగా ఉన్నాడు.

# పాత్రలు

౧ అగ్నిహోత్రావధాన్లు:— కృష్ణారాయపుర మగ్రహారము కాపురస్థుడు.

౨. వెంకటేశము :— అగ్నిహోత్రావధాని కుమారుడు.

౩. గిరీశం :— వెంకటేశమునకు చదువు చెప్పునయ్యవారు.

౪. కరటకశాస్త్రులు :— వెంకమ్మ తోడబుట్టినవాడు.

౫. లుబ్ధావధాన్లు :— రామచంద్రపుర మగ్రహారము కాపురస్థుడగు నొక బ్రాహ్మణుడు.

౬. రామప్పంతులు :— కృష్ణారాయపుర* మగ్రహారము కాపురస్థుడగు నొక లౌక్యుడు.

౭. సౌజన్యారావు పంతులు :— ప్లీడరు.

౮. భీమారావు పంతులు :— ప్లీడరు.

౯. నాయుడు :— ఏజన్సీ కోర్టు వకీలు.

౧౦. కరటక శాస్త్రుల శిష్యుడు:— డెప్యూటీ కలెక్టరు, హెడ్ కనిస్టీబు, బైరాగి, శూద్రులు, దుకాణదారు, కలక్టరు కచేరీ గుమాస్తాలు, బ్రాహ్మణులు, బంట్రౌతులు మొదలగువారలు.

౧. వెంకమ్మ:— అగ్నిహోత్రావధాని భార్య.

౨. బుచ్చమ్మ:— అగ్నిహోత్రావధాని కూతురు.

౩. మీనాక్షి:— లుబ్ధావధాని కూతురు.

౪. మధురవాణి:— రామప్పంతులుంచుకొనిన సాని.

---

* రెండో కూర్పులో 'రామచంద్రపురంలో అగ్రహారీకుడు' అని వుంది. రామప్పంతులు కృష్ణారాయపురం అగ్రహారీకుడు కాడు. (సం.)







పైని ఎడమ : విజయనగరం మహారాజా కళాశాల మొదటి ప్రిన్సిపాల్. విద్యార్థి దశలో గురజాడను ఆదరించిన ఉదారుడు, సి. చంద్రశేఖర శాస్త్రి.

పైని కుడి : గురజాడకు గురుసమానుడు. మహా పురుషుడు కందుకూరి వీరేశలింగం.

దిగువ : గురజాడ ఇంగ్లీషు కవిత్వాన్ని మెచ్చి, ఆయనపట్ల వాత్సల్యాన్ని, ప్రేమను చూపిన బెంగాల్ ప్రముఖ మేధావి, శంభుచంద్ర ముఖర్జీ.



కన్యాశుల్కంలో
ప్రస్తావించిన
విజయనగరం
లోని స్థలాలు

పైనుండి
దిగువకు



బొంకుల దిబ్బ

అయ్యకోనేరు

కస్పా బజారు



# కన్యాశుల్కము

## మొదటి యంకము

### ౧. స్థలము విజయనగరములో బొంకుల దిబ్బ

(గిరీశం ప్రవేశించి)

గిరీశ— సాయంకాలమైనది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెట్టు తానని నెల రోజులైనది పది రూపాయలు పట్టుకు వెళ్లి డ్యాన్సింగు గర్లు కింద ఖర్చుపెట్టినాను యీవేళ ఉదయము పూటకూళ్లమ్మకూ నాకూ యుద్ధము అయిపోయినది. బుఱ్ఱ బద్దలకొడదామా అన్నంత కోపం వచ్చినది కాని, పూర్ రిచ్చర్డు చెప్పినట్లు పేషన్సు వుంటేనే కాని లోక ములో పని జరగదు.

**When lovely woman stoops to folly,**
**And finds too late that men betray,**
**What charms can soothe her melancholy,**
**What arts can wash her guilt away?**

ఈలా డబ్బు లాగేస్తే యిదివరకు యెన్ని పర్యాయములు ఊరుకున్నది కాదు? డ్యాన్సింగు గర్లు మాట యేదో కొంచెము అచూకీ కట్టినట్టు కనబడుతుంది లేక యెవళ్లయినా నా మీద కోపం కొద్దీ ఉన్న నిజం దానితో చెప్పివేశినారేమో! ఈవేళ ఉదయం సంగతి ఆలోచిస్తే యిటు పైని తిండిపెట్టేటట్టు కనపడదు ఇక యీ వూరులో మన పప్పు వుడకదు. ఎటు చూచినా అందరికీ బాకీలేను వెంకు పంతులుగారి కోడలికి లవ్ లెటర్ వ్రాసినందుకు యెప్పుడో వొకప్పుడు సమయం చూసి యెముకలు విరగ్గొట్టేస్తారు.

**Can love be controlled by advice?**
**Will cupid our mothers obey?**

శీఘ్రంగా బిచాణా యిక్కడ నుండి యెత్తివెయ్యడమే బుద్ధివంతుడికి లక్షణం—గాని మహాలక్ష్మిని వదలడమంటే యేమీ మనస్కరించ కుండా వున్నది

**It is women that seduce all mankind.**

నేను యేదో ఉద్యోగాలూ ఊళ్లు యేలి తనతో వైభవము వెలిగిస్తాననే నమ్మకముతో ఉన్నది పూర్ క్రీచర్ !

**Oh! whistle to me and I will come away,**
**Though father mother and grandmother**
**Should go mad.**

ఎవరా వస్తూ ఉన్నది? నా ప్రియ శిష్యుడు వెంకటేశ్వరులులాగు వున్నాడు. ఈవేళ కిస్మీస్ శలవులు యిచ్చివుంటారు. వాడి ముఖం వైఖరి చూస్తే పెయిలయినట్టు కనబడుతున్నాడు. వీడికి శలవులలో చదువు చెప్పే మిష మీద వీడితో కూడా వీడి వూరు వుడాయిస్తే చాలా చిక్కులు వదులుతవి. అటునుంచి నరుక్కురమ్మన్నాడు.

(వెంకటేశ్వర్లు ప్రవేశించుచున్నాడు.)

**గిరీశ:**—ఏమివాయి, మైడియర్ షెక్స్పియర్. ముఖం వేల వేసినావు ?

**వెంకటే.**—ఇక మీరు నాతో మాట్లాడకండి, మీతో సావాసం చేయడము చేత నా పరిక్ష పోయిందని మా మేష్టరు గారు చెప్పినారు.

**గిరీశ**·— నాన్సెన్స్, మొదటినుంచీ నేను అనుమానిస్తూనే వున్నాను. నీ మేష్టరుకి నన్ను చూస్తే కిట్టదు. అందుచేత నిన్ను ఫెయిలు చేసినాడు గాని, లేకుంటే నువ్వు యేమిటి ఫెయిలు కావడమేమిటి! అతనికీ నాకూ యెందుకు విరోధము వచ్చిందో నీకు తెలిసిందా? అతను చెప్పేదంతా తప్పుల తడక అది నేను న్యూస్ పేపరులో పెట్టి యేకివేసినాను

**వెంకటే:**— మీవల్ల నాకు వచ్చినదల్లా చుట్ట కాల్చడం వక్కటె పాఠం చెప్పమంటే యెప్పుడూ కబుర్లు చెప్పడమే కాని, ఒక మాటయినా ఒక ముక్క చెప్పిన పాపాన పోయినారా!

**గిరీశ:**— డామిట్ యిలాంటి మాటలంటే నాకు కోపము వస్తుంది. ఇది బేస్ యిన్గ్రాటిట్యూడ్ నాతో మాట్లాడుతుండడమే యెడ్యుకేషన్. నీకున్న లాంగ్వేజి నీ మేష్టరుకైనా వుందీ? వీడో మారేజి విషయమై నాచ్ కొశ్చన్ విషయమై నీకు యెన్ని లెక్చెర్లు యిచ్చాను నా దగ్గర చదువుకొన్న వాడు ఒకడూ అప్రయోజకుడు కాలేదు పూనాలో డెక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు, ది ఇలివెన్ కాజస్ పర్ ది డీజనరేషన్ ఆఫ్ ఇండియా విషయమై మూడు ఘంటలు ఒక్క బిగిని ఆలాగు లెక్చర్లు యిస్తే ప్రొఫెసర్లు అంతా టర్రు కొట్టేశారు మొన్న బంగాళ బాబు యీ

వూళ్లో లెక్చెర్లు యిచ్చినప్పుడు ఒకడికయినా నోరు పెగిలిందీ. మనవాళ్లు వట్టి వెధవాయిలోయి. చుట్ట కాల్చడం యొక్క మజా నీకేమి భోదపడలేదు. చుట్ట కాల్చడం నించే దొర్లు యింత గొప్పవాళ్లు అయినారు. చుట్ట కాల్చని యింగ్లీషు వాడిని చూశావూ? చుట్ట కాల్చడం బట్టె స్టీము యంత్రం కనుక్కున్నారు. శాస్త్రకారుడు కూడా యేమన్నాడో వినలేదా ?

**క॥ ఖగపతి యమృతము తేగా।**
**భుగభుగమని పొంగి చుక్క భూమిని వ్రాలెన్।**
**పొగ చెట్టై జన్మించెను।**
**పొగ తాగనివాడు దున్నపోతై బుట్టున్।**

ఇది బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసములో వున్నది అది అలాగు వుణ్ణీ గాని నీ అంత తెలివయిన కుర్రవాడిని ప్రొమోషన్ చెయ్యనందుకు నీ మేష్టరు మీద నా వళ్లు మహా మండుతూ వున్నది. ఈమాటు వంటరిగా షికారు వెళ్లుతూన్నప్పుడు చూచి ఒక తడాఖా తీస్తాను. నీవు శలవులలో యిక్కడ వుంటావా లేక, మీ వూరికి వెళతావా ?

వెంకటే:— మా వూరికి వెళ్లాలని వుంది కాని (గద్గద స్వరముతో) ప్యాసు కాలేదంటే మా వాళ్లు కొట్టేస్తారు.

గిరీశ.— నీకు నేనొక వుపాయం చెప్పుతాను. నేను చెప్పినట్టల్లా యెప్పుడూ వింటానని ప్రమాణకం చేస్తావా ?

వెంకటే:— (అతని కాళ్లు పట్టుకొని) ఏలాగైనా నన్ను రక్షించాలి. మా నాన్నకు మాచెడ్డ కోపం. ఇంటికి వెళ్లితే యెముకలు విరగగొట్టేస్తాడు.

గిరీశ·— దట్ యీస్ టిరనీ. యిదే బంగాళీ కుర్రవాడవుతే యేమి చేస్తాడో తెలిసిందా? కర్ర పట్టుకుని తండ్రియేది తాతయేది భద్దాలు యెక్కకొడ తాడు. మీ అగ్రహారంలో మరి యెవరూ స్కూలు కుర్రవాళ్లలో లేరు గద?

వెంకటే — లేరు.

గిరీశ:— అయితే నేనొక వుపాయం చెప్తాను విను. నేను కూడా నీతో వస్తాను. నువ్వు ప్యాస్ అయినావని చెప్పేదాము. కావలిస్తే అటుంచి వచ్చిన తరువాత టవును స్కూలులో ప్రవేశించవచ్చును.

వెంకటే:— మీరు కూడా వుంటే నాకు భయము లేదు, మొన్న వేసంగి శలవులలో కూడా మా అమ్మ శలవులలో పాఠాలు చెప్పడానికి మిమ్మలిని తీసుకురమ్మంది.

**గిరీశ:**— ఆల్ రైట్. కాని నాకిక్కడ చాలా వ్యవహారములలో నష్టము వస్తుంది. మునసబుగారి కొమాళ్లకి శలవులలో పాఠాలు చెప్పితే ట్వంటీ రుపీస్ యిస్తామన్నారు అయినా నీ విషయంలో యెంత లాస్ వచ్చినా నేను కేర్ వెయ్యను. మీవాళ్లు బార్బరస్ పీపిల్, తిన్నగా ట్రీట్ చేస్తారో చెయ్యరో. నీవు నా విషయమై గట్టిగా రికమెండు చెయ్య వలసియుంటుంది కొత్త పొస్తకాలు కొనడముకు ఒక జాబితా వ్రాయి. కొంచెము డబ్బు చేతిలో వుంటేనే గాని సిగర్సుకి కొంచెము యిబ్బందిగా వుంటుంది. నోట్‌బుక్కు పెన్సలు తియ్యి·—

1 రోయల్ రీడర్.
2 మ్యాన్యువల్ ఆఫ్ గ్రామరు.
3 గోషన్ జ్యామెట్రి.
4 బాసూస్ ఆల్జిబ్రా.
5 బాసూస్ అర్థమెటిక్కు.
6 నల చరిత్ర.
7 రాజశేఖర చరిత్ర.
8 షెప్పర్డ్సు జనరల్ యింగ్లీషు.
9 వెంకటసుబ్బారావ్స్ మేడీజీ.

యెన్ని పుస్తకాలయినాయి.

**వెంకటే:** —తొమ్మిది పొస్తకాలయినాయి.

**గిరీశ.**—మరొక్కటి వెయ్యి-కుప్పుసామి అయ్యర్సు మేడ్ డిఫికల్ట్. అక్కడికి చాలును. మీ వాళ్లు గాని ఇంగ్లీషు మాట్లాడమంటే తణుకూ బెణుకూ లేకుండా పుస్తకాలలో వున్న ముక్కలు ఏకరపెట్టెయ్యి. నీ దగ్గిర యేమయినా కాపర్సు వున్నవా ? బ్యాంకి నోట్లు మార్చలేదు. వక పదణాలు పెట్టి మిఠాయి పట్టుకొని రా. రాత్రి మరి నేను భోజనము చెయ్యను మార్కట్‌కు వెళ్లి బండి కుదిర్చేశి దాని మీద నా ట్రావెలింగు ట్రంక్ పడేసి మెట్టు దగ్గిర బండి నిలబెట్టి వుంచు. ఇక్కడ కొన్ని పనులు చక్కబెట్టుకొని యెంత రాత్రి కయినా వచ్చి కలుసుకుంటాను. గో యట్ వన్స్ మై గుడ్ బోయ్. నీవు బుద్ధిగా చెప్పిన మాటలు వింటూ వుంటే సురేంద్రనాథ్ బనర్జీ అంత గొప్ప వాడిని చేసేస్తాను.

నేను నీతో వస్తానన్న మాట మాత్రం పిట్టకైనా తెలియనియ్య వద్దు.
(వెంకటేశ్వరులు నిష్క్రమించుచున్నాడు)

**గిరీశ**·— (తనలో) ఈ వ్యవహారమొకటి ఫైసలయింది. ఈ రాత్రి మహా లక్ష్మికి పార్టింగు విజిట్ యివ్వవలెను.

(పైకి) రవణింతున్నతి కాలకంరమకుటాట్టాలప్రతోశీమిళ
త్యవమావా మరశింధుబంధురవయస్సంభార

(ఒక బంట్రోతు ప్రవేశించి)

**బంట్రోతు**:—అయ్యా మొన్న మీరు వేయించుకొన్న పొటిగ్రాఫుల ఖరీదు అడగమని మా పంతులు గారు పంపించారు.

**గిరీశ**:— (వినబడనట్టు నటించుచు)

గంభీర వాగ్వ్యవహారైక ధురంధరత్వమగు జివ్వాలోలిమత్తలికిన్ ।
జవికిందల్లికి కారవేళ్లికి ధమర్జ్యాపల్లి నీరుల్లికిన్॥

**బంట్రోతు**:— యంతమందిని పంపించినా యిదుగో యిస్తామని అదుగో యిస్తామని తిప్పుతూ వచ్చేవారట నేను వాళ్లలాగు వూరుకునేవాడను కాను.

**గిరీశ**:— అయ్యకోనేటికి తోవ యిదే

**బంట్రోతు**:— యిదెక్కడ చెమిటి మహాలోకము వచ్చిందయా.

**గిరీశ**:— కోమటి దుకాణమా? కస్పా బజారులో కాని ఇటివైపు లేదు.

**బంట్రోతు**:— (గట్టిగా చెవి దగ్గర నోరు పెట్టి) పొటిగ్రాఫుల ఖరీదు యిస్తారా ఇవ్వరా?

**గిరీశ**:— బస రాధారీ బంగాళాలో చెయ్యవచ్చును.

**బంట్రోతు**:— (మరీ గట్టిగా) మీరూ సానిదీ కలిసి చేయించుకున్న పొటిగ్రాఫు ఖరీదు 16 రూపాయలు. అప్పుడే యిస్తామని యింకా తిప్పులు పెడుతూ న్నారు.

**గిరీశ**:— ఓహో నీవా! నింపాదిగా మాట్లాడు. నింపాదిగా మాట్లాడు. రేపు వుదయం తప్పకుండా 8 ఘంటలకు పూటకూళ్లమ్మ యింటికి వచ్చిన ట్టైనా రూపాయలు అణా పైసలతో ఇచ్చి వేస్తాను. మీ పంతులుకు స్నేహమూ మంచీ చెడ్డా అక్కర లేదూ. ఇంత తొందర పెట్టడానికి యే వూరైనా పారిపోతామా యేమిటి.

**బంట్రోతు.**— మాటలతో కార్యము లేదు, రూపాయలు నిలువబెట్టి మరీ పుచ్చుకోమన్నారు.

**గిరీశ** — పెద్దమనిషివి నువ్వూ అలాగే అనడం ధర్మమేనా? రేపు వుదయం యివ్వకపోతే మాలవాడి కొడుకు ఛండాలుడుతో సమానము– ఇంకా నీకు నమ్మకము లేకపోతే యిదుగో గాయిత్రి పట్టుకు ప్రమాణం చేస్తాను.

**బంట్రోతు.**— కానియ్యండి రేపు వుదయం ఇయ్యకపోతే మాత్రం భవిష్యం వుండదు. [అని, నిష్క్రమించుచున్నాడు.]

**గిరీశ.**— (తనలో) ఇన్నాళ్లకు జంధ్యపు పోచ వినియోగంలోకి వచ్చింది. థియాసొఫిస్ట్ చెప్పినట్లు మన ఓల్డు కస్టమ్సుకు ప్రతిదానికీ యెదో ఒక ఉపయోగం ఆలోచించే మనవాళ్లు నియమించారు. యిప్పుడు నాకు బోధపడ్డది.

ఈ పిశాచాన్ని వదుల్చుకునేటప్పటికి తలప్రాణం తోక్కి వచ్చింది. చీకటి పడింది. శీఘ్రబుద్ధే పలాయనం అని పెందరాళే ఈ వూరు నుంచి వుడాయిస్తే కాని ఆబోరు దక్కదు. ఇక బయలుదేరి మహాలక్ష్మి ఇంటికి వెళ్లవలెను. మేక్ హే వైల్ ది సన్ షైన్స్ అన్నాడు. (పైకి)

**పూజారి వారి కోడలు। తాజారగ బిందె జారి జర్రున పడియెన్।**

ఆ పై ముక్క మరి జ్ఞాపకము వచ్చినది కాదు (చుట్ట నోటిలో బెట్టుకొని అగ్గిపుల్ల వెలిగించుచుండగా తెర దించివేయవలెను.)

## ౨. స్థలము కృష్ణారాయపురం అగ్రహారంలో అగ్నిహోత్రావధాన్లు గారి నడవ

(అగ్నిహోత్రావధానులు గారు కూర్చుని జంధ్యాలు వడుకుచు కరటకశాస్త్రులు శిష్యుని చేత పేలు నొక్కించు కొనుచు వేంకమ్మ కూర తరుగుచు గనబడుదురు.)

**వెంకమ్మ:**— నిన్నటినుంచి కిసిమీశ్శలవులని కుర్రవాడు వుత్తరం వ్రాసినాడు. యెన్నాళ్లైందో చూచి. కళ్లు కాయలు కాచిపోయినాయి. గడియో గడియో వస్తాడు కాబోలు.

**అగ్ని హొూ:**— ఏందుకు వట్టినే పగబడం నేను వద్దువద్దంటూంటే ఇంగ్లీషులో పెట్టావు మెరక పొలం మీద వచ్చే శిస్తంతా వాడికింద ఖర్చు అయి పోతున్నది క్రిందటి సంవత్సరం పరీక్ష పేలు అయిపోయినాడు. మనకి ఇంగ్గీషు అచ్చిరాదని పోరిపోరి మొదటే చెప్పాను. మాపెత్తండ్రి దిబ్బావధానులు కొడుకుని ఇంగ్లీషు చదువుకు పార్వతీపురం పంపించే టప్పటికి వృష్ణం వచ్చి మూడు రోజుల్లో కొట్టివేశింది. బుచ్చబ్బి కొడుక్కి ఇంగ్గీషు చెప్పిందా మనుకుంటూండగానే పెద్ద ఖాయిలా పెట్టి చచ్చినంతైంది.

**వెంకమ్మ:**—మీరు యెప్పుడూ యిలాంటి వాగాయత్తం మాటలే అంటారు. డబ్బు ఖర్చు అయిపోతుందని మీకు బెంగ. మొన్న మొన్న నా కళ్ల యదట మన వాకట్లో జుత్తు విరబోసుకుని గొట్టి కాయలు ఆడుకునే వాడు నేమానివారి కుర్రాడికి మునసబీ అయిపోయింది.

**అగ్ని హొూ:**— మన వెదవాయికి చదువువచ్చేది యేమీా కనపడదు కాని పుస్తకాల కింద జీతం కింద యిక నాలుగుయేళ్లయేటప్పటికి మన భూమి కడితేరిపోతుంది ఆ పైని చిప్పా దొప్పా పట్టుకుని బయలు దేరాలి - నిమ్మళంగా ఇంటి దగ్గిర వుంటే యీ పాటికి నాలుగు అర్థాలు చెప్పి వేదును వొద్దంటూంటె యీ వెధవ ఇంగ్లీషు చదువు కింద పెట్టావు.

**వెంకమ్మ** — మన వాడికి ఒక మునసబు పనైనా, పోలీసు పనైనా అవుతే ఋణాలిచ్చి యీ అగ్రహారం భూములన్నీ కొనేస్తాడు. సాలుకు వక నూఱు రూపాయీలు ఖర్చు పెట్టడానికి ముందూ వెనుకా చూస్తున్నారు. మీలాగే వాడూ పెద్ద కడుపు వేళ్లాడేసుకుని జంయీాలు వడుక్కుంటూ బతకాలని వుందా యేమిటి? మీకంత బారమని తోస్తే మావాళ్లు నా పసుపూ కుంఖానికి యిచ్చిన భూమి అమ్మేసి కుర్రాడికి చదువు చెప్పిస్తాను.

**కరటక** — నీ భూమి యెందుకు అమ్మాలి మన సొమ్ము చెడతిని కొవ్వి వున్నాడు అతనే పెట్టుకుంటాడు.

**అగ్ని హొూ:**— అయితే నా కడుపును అక్షేపణ చేస్తావషె? యీ మారంటె నీ అన్న వున్నాడని వూరుకునేది లేదు సుమా!

(గిరీశ వెంకటేశ్వర్లు ప్రవేశించు చున్నారు)

**వెంకమ్మ:**- మా బాబు - మా బాబు వచ్చావషోయి – (అని లేచి వెళ్లి కవుగలించుకొనుచున్నది).

**అగ్నిహో:-** వెధవాయా యీ మాటైనా ప్యాసు అయినావా లేదా ?

**వెంకటే:-** (తెల్లబోయి జూచుచున్నాడు)

**గిరీశ :-** ప్యాసు అయినాడండి- పస్టుగా ప్యాసయినాడు.

**అగ్నిహో :-** యీ తురక యెవడోయి?

**గిరీశ .-** టర్కు! డామిట్, టెల్ మాన్

**అగ్నిహో .-** మాన్ ! మానులా వున్నానంభావు ? గూబ పగల కొడభాను.

**వెంకటే .-** (వణుకుతూ తల్లి వైపు చూచి) అమ్మా యీయనే నాకు చదువు చెప్పుతాడు

**కరటక :-** ఇంటికి పెద్దమనిషి వస్తే అప్పృచ్చపు మాటలాడుతావేమి ఇంగ్లీషు మాట ఆయనేమో కుఱ్ఱవాడితో అంటే పుచ్చకాయ దొంగంటే బుజాలు తడుముకున్నట్టు నీ మీద పెట్టుకుంటావేమి

(బండివాడు సామాను దించును).

**గిరీశ :-** తమరు యిక్కడా వున్నారు. నన్ను తమరు యరగకపోయి వుండ వచ్చును గాని సంస్కృత నాటక కంపెనీలో తమర్ని తరుచుగా చూస్తూ వుండేవాడిని. యిండియా అంతా తిరిగినాను. గాని తమ వంటి విదూషకుణ్ణి యక్కడా చూడలేదు. సంస్కృతం, అరవం, మహారాష్ట్రం, యింకా యెన్నో భాషలు మంచినీళ్ల ప్రవాహంలా మాట్లాడుతారు.

**అగ్నిహో :–** (దుమధుమలాడుచు) యీ శేషభిషలు నాకు పనికిరావు. ఈయన వైఖరి చూస్తే యిక్కడే బస వేసేటట్టు కనబడుతున్నది నా యింట్లో భోజనం యంత మాత్రమూ వీలుపడదు.

**వెంకమ్మ :–** ఆయన వెఱ్ఱివాడు, ఆయన మాట గణనలోకి తేకు బాబూ యాలాగైనా మావాణ్ని కడుపులో పెట్టుకుని ఒక్కముక్క అబ్బేటట్టు చేయి బాబూ వాడు వట్టి సత్తెకాలం నాయన. నా మోస్తరే

**గిరీశ :—** అభ్యంతర మేమిటమ్మా, మీ వాడు శలవులలో చదువు చెప్ప మని యెంతో బతిమాలుకుంటే పోనీ పనికివచ్చే కుఱ్ఱవాడు గదా అని వచ్చినాను. లేకుంటే పట్నంలో వంచపక్వపరమాన్నాలు మానుకుని ఇక్కడ ముతక బియ్యం తినడానికి, యెందుకు వస్తాను

**కరటక —** (తనలో) వీడు టక్కర్‌లా వున్నాడు.

**వెంకమ్మ.**— ఈ చదువుల కోసమని పిల్లలను వదులుకుని వుండడం వాళ్లక్కడ శ్రమదమాదులు పడుతూ వుండడం, నా ప్రాణాలు యెప్పుడూ అక్కడే వుంటాయి - డబ్బంటే యెప్పుడూ వెనక చూడలేదు గదా- మేము కనడం మట్టుకు కన్నాము మీరే తల్లీ దండ్రీ. వాడిని యేలాగు బాగు చేస్తారో మీదే భారం.

**గిరీశ.**— మీరు ఇంత దూరం శలవు యివ్వవలెనా. నా మంచీ చెడ్డా మీ కుర్రవాణ్ని అడిగితేనే తెలుస్తుంది. ఇంతెందుకు ఇక మూడు సంవత్సరములు నా తరిఫీతులో వుంచితే క్రిమినల్ లోవర్ అనగా పోలీసు పరీక్ష ప్యాసు చేయించివేస్తాను డబ్బు విషయమై మట్టుకు మీరు వెనక తీయకుండా వుండాలి

**అగ్నిహో·**— యీ సంవత్సరం పుస్తకాలకి యెంతైందిరా అబ్బీ

**వెంకటే·**— పదిహేను రూపాయిలవుతుంది

**అగ్నిహో·**— ఒక దమ్మిడీ ఇచ్చేది లేదు. వీళ్లిద్దరూ కూడి ఆ రూపాయలు పంచుక తినేటట్టు అగుపడుచుంది గాని మరేమీ లేదు నేను వేదము 82 పన్నాలూ జటాంతం వరకూ పుస్తకాల కింద ఒక దమ్మిడీ ఖర్చు లేకుండా చదువుకున్నాను ఇదంతా టోపీ వ్యవహారంలాగ కనబడుతుంది.

**కరటకశాస్త్రి:** (ముఖం వంకబెట్టి నవ్వుకొనును )

**గిరీశ** — (కరటకశాస్త్రుల వైపు చూచి) బార్బరస్. చూచారండీ జన్‌టిల్ మ్యాను అనగా పెద్దమనిషిని యెలాగు అంటూన్నారో నేను యీ నిమిషం వెళ్లిపోతాను

**వెంకమ్మ·**— బాలు బాలు బాగానే వున్నది ఇంటికి యెవరైనా పెద్దమనిషి వస్తే నాకిదే భయం అయన మాటల కెక్కడికి - బాబూ వెళ్లకండి. అన్నిటికీ నేను వున్నా కదా.

**కరటక** — అగ్నిహోత్రావధానులూ కుర్రవాడికి రవ్వంత చదువు చెప్పించడానికి ఇంత ముందూ వెనకా చూస్తూన్నావు. బుచ్చమ్మని అమ్మిన పదిహేను వందల రూపాయిలూ యేమి చేసినావు

**గిరీశ** — సెల్లింగ్ గర్ల్స్ ! డామిట్

**అగ్నిహో:**—ప్రతి గాడిద కొడుకూ అమ్మేవు అమ్మేవు అంచూ వుంచాడు కూరగాయపోయి—అమ్మడానికి. ఆ రూపాయిలు పుచ్చుకోకపోతే మొగు

డైరీల్లోనూ, నోట్స్‌లోనూ కొల్లలుగా కనిపిస్తాయి. ఈ పరిశ్రమలో భాగంగా తాను రాయదలుచుకున్న నాటకాలకు పథకాలు రాసి పెట్టుకు న్నారు. కొంతవరకు రాసి వదిలిపెట్టినవీ వున్నాయి. ఇటువంటి వాటిలో "కొండుభట్టీయం", "బిల్హణీయం" ప్రసిద్ధమైనవి. కన్యాశుల్కాన్ని మూడు భాగాలుగా రాద్దామన్న ఆలోచన ఆయన కుండేదని శేషగిరిరావు తన వ్యాసంలో తెలిపారు

ఆధునిక ప్రపంచ నాటక సాహిత్యంలోనూ, సాహిత్య మంతట్లోనూ కన్యాశుల్కం స్థానం మొదటి పంక్తిలోనే వుంటుందని చెపితే, అది అతిశయోక్తి అవదు ఆధునిక సంస్కృతి, నాగరికత మొట్టమొదట మొదలైన యూరప్ ఖండం దేశాల తరవాత, ఎంతో కాలానికి గాని అవి భారతదేశం వంటి దేశాల్లో తలెత్తలేదు. అయినా 1892 సరికి— అంటే యీ దేశంలో ఆధునిక జీవిత విధానం మొలకెత్తుతున్న తొలి దశలోనే కన్యాశుల్కం రంగస్థలం మీది కొచ్చింది ఆధునిక నాటక సాహిత్యానికి ఆద్యులలో వొకరైన హెన్రిక్ ఇబ్సన్ (1824 - 1904) వంటివారు గురజాడ కాలానికి మరీ ముందరి వారు కారు. భారతీయ భాషల్లో కన్యాశుల్కానికి ముందర, దాని ఆధునిక సాహిత్య విలువలున్న నాటకం పుట్టిందీ లేనిదీ నిర్ధారణ కావలసి వుంది.

ఇబ్సన్ మొదట్లో తన నాటకాల్ని వాడుకలో లేని భాషలో, పద్యరూపంలో రాసి, తరవాత వాడుక భాషకు వెళ్లడం జరిగిందట. తన పాత్రలు మనుషుల భాషనే మాట్లాడుతాయి కాని, వాళ్లచేత దేవుళ్ల భాషలో మాటాడించనని తెలిపారట.

బెర్నార్డ్ షా (1856 - 1950) లండన్లోని మురికి పేటల జీవితాన్ని గురించి, "విడోవర్స్ హౌసెస్" అన్న నాటకం రాశారు. అది 1892 డిసెంబరు 9న మొదటిసారి ప్రదర్శింపబడింది (కన్యాశుల్కం తొలి ప్రదర్శనం అదే ఏడాది ఆగస్టు 13 న జరిగింది). "విడోవర్స్ హౌసెస్"కు ముందర, వర్తమానకాల సాంఘిక సమస్యల గురించి ఇంగ్లీషులో నాటకాలు లేవు. వర్తమాన సాంఘిక సమస్యల ఇతివృత్తంతో, షా తరవాతనే ఇంగ్లీషు

---

హాస్యరసము గురించిన్నీ, విదూషకుల గురించిన్నీ, సంఘటనములకు, పాత్రరచనలకూ గల సంబంధము గురించిన్నీ, పాత్రోచితమైన వేషము గురించిన్నీ, ఆయానాటక కర్తలా యానాటకము లేల వ్రాయుదురనిన్నీ, నాటక రచయితల కష్టనిష్టురముల గురించిన్నీ విపులమగు విమర్శలు చదువు చుండినట్లు కనబడును మననేటి నవ్యసాహిత్య పరులకు కూడా, పై విమర్శల వంటివి రచనా రహస్యములను స్ఫురింపజేయగలవు" ("శ్రీ గురజాడ అప్పారావు గారి డైరీలు") అని తెలిపారు

నాటకకర్తలు రాయడం మొదలుపెట్టారు. ఇటువంటి నాటక రచన ఇబ్సన్ 1875 నుంచీ చేస్తున్నారు. గురజాడకు ముందర యిటువంటి నాటక సాహిత్య సృష్టి చేస్తున్న వారెందరో లేరు ఇబ్సన్, గోగోల్ ("ఇన్‌స్పెక్టర్ జనరల్" నాటకకర్త) వంటి చాలా కొద్దిమంది మాత్రమే వున్నారు. కన్యాశుల్కానికి ముందర సమకాలీన యితివృత్తంతో, ఆధునిక నాటక రంగస్థల పద్ధతిని; గొప్ప సాహిత్య విలువలు, సామాజికాభ్యుదయదృష్టి, శిల్ప ప్రావీణ్యం వున్న నాటకాలు యూరప్‌లో కొద్ది సంఖ్యలో మాత్రమే వుండవచ్చును. భారతీయ భాషల్లో అటువంటివి వున్నట్టు లేదు. "కన్యాశుల్క నాటకకళ"లో (గ్రంథ కర్త సర్దేశాయి తిరుమలరావు, అనుబంధం 3) తెలిపిన విషయం, యీ సందర్భంలో గమనార్హం: "పందొమ్మిదవ శతాబ్దాపర భాగమున జనించిన" నాటకకర్తల జాబితా యిచ్చి, దానిలో 21 మంది ప్రపంచ నాటక కర్తలను అది పేర్కొంది. వారిలో యిద్దరే యిద్దరు భారతీయులు. గురజాడతోపాటు ఆ జాబితాలో వున్న యింకో భారతీయ నాటకకర్త, దీనబంధు మిత్ర (1829 - 1873) "పాశ్చాత్య దేశములందు మహోత్తమ నాటకకర్త లున్నప్పుడే భారతదేశమందు గురజాడ వుండెను. విశ్వ సంస్కృతీ నిర్మాణమునకు పునాది రాళులు మోసిన వారిలో నొకడు గురజాడ" (అదే పుస్తకంలో).

ఇటువంటి అభిప్రాయమే "మొట్టమొదటి కన్యాశుల్కము" సంపాదకుడు, బండి గోపాలరెడ్డి, దాని "ముందు మాటలు"లో వ్యక్తం చేశారు: "తమకు సమకాలికంగా జీవించి ప్రపంచంలో ఆనాటికే నాగరికంగా చెలామణిలో వున్న యీ నానా దేశాల వుద్దండ నాటక రచయితల సరసన (గురజాడ) సగర్వంగా కూర్చోగలరు; వారి నాటకాల మధ్య దివిటీ ముందు ప్రమిద లాగ కాదు, దివిటీ ముందర యింకో దివిటీగా భాసించగల సత్తా తెలుగు కన్యాశుల్కానికి వుందని నమ్మేవాళ్లలో నొకణ్ని"

## విషమ సమస్య

కన్యాశుల్కానికి ముందర తెలుగులో సాంఘిక నాటకాలు లేకపోలేదు; నాయక రాజుల కాలపు అన్నదాన సమాజం వంటి వట్టి ప్రహసనాలు అవి. అది ఆ కాలపు పరాన్న భుక్కులైన సోమరిపోతుల్ని అవహేళన చేసిన కేవల ప్రహసనం; ఉత్తమ సాహిత్యంగా చెప్పవలసింది కాదు "బ్రాహ్మ వివాహం" విషయమూ యిదే.

సమకాలీన సాంఘిక విషయం వున్న నాటకసాహిత్యమేకాదు, అటువంటి ఏ సాహిత్యమైనా ప్రపంచ భాషల్లో ఒకటి రెండు శతాబ్దాల క్రితం వరకు పని పెట్టుకొని వెతికితేకాని కనిపించదు కనిపించినా, ప్రామాణిక మనదగ్గదీ కాదు.

ఇందుకు మినహాయింపుగా చెప్పవలసింది భాసుని "చారుదత్తం," దాన్ని పెంచి శూద్రకుడు రాసిన "మృచ్ఛకటికం." ఇవి ప్రపంచ స్థాయిని బహుశా తొలి ఉత్తమశ్రేణి సాంఘిక నాటకాలు.[36] వీటి యితివృత్తం కల్పితం కాదనడానికి ఆధరాలు లేవు. విశేషమేమిటంటే, దుష్టరాచరితాన్ని కూలదోసి యింకో రాజును ఎన్నుకోవడం నాటక్ర కధలో ఉపాంగం. ఆ కాలపు సమాజ ప్రతిబింబం దానిలో కనిపిస్తుంది. కధానాయిక వసంతసేన, మధురవాణి అంతగా కాదుగాని, యీ నాటక కదలో వొక ముఖ్యపాత్ర. వసంతసేన పుట్టుకవల్ల వేశ్యాకులానికి చెందినా బుద్ధి, నడత మొదలైన వాట్లో పురాణ కథల్లోని పతివ్రతల కోవకు చెందిన మనిషి. కధా నాయకుడు చారుదత్తుడు పతి కాకపోయినా, వసంతసేనకూ పురాణాల్లోని పతివ్రతలకూ తేడా లేదు. మధురవాణి పుట్టుక పెరుగుదలలకు, ఆ తరవాత వచ్చిన పెద్ద పరివర్త నకూ పోలికే లేదు. వసంతసేన ఆదినుండి అంతం వరకూ వొకే మాదిరీ పాత్ర. అంచేత, వసంతసేన పాత్ర చిత్రణలాగా మధురవాణి పాత్ర చిత్రణ సులభమైంది కాదు. మధురవాణి పాత్ర పోషణలో క్రమ క్రమ పరిణామ చిత్రణలో, గురజాడ చూపిన ప్రతిభ సాటిలేనిది. వసంతసేన సజ్జనుడైన చారుదత్తుణ్ని వరించింది. ఆయన యిష్టపడి (పెళ్లి చేసుకోలేదు గాని) ఆ వేశ్యను స్వీకరించాడు. మధురవాణి వరించిన సౌజన్యారావు తీరు వేరు. వేశ్యాకులాన్ని కల్పించిన సాంఘిక వ్యవస్థ మీదకాక, అందులో పుట్టడం వల్ల దుర్గతి పాలైన వేశ్యల పైని బద్ధ వ్యతిరేకత వున్న పిడివాదపు మనిషి ఆయన. తన కులస్తులు పెళ్లి చేసుకోడానికి తగినవారు కారు కాబట్టి, తగిన మంచి మనిషిని బేసుకొని వృత్తిని వదిలి పెట్టాలని మధురవాణి తహ తహ లాడింది. సౌజన్యారావు సౌజన్యం తనకు నచ్చడం వల్ల, నోరు విడిచి అడిగింది. ఇందుకు భిన్నంగా జపాన్ దేశంలోని వేశ్యల్ని (గైషాలు) కులీనులు పెళ్లిచేసుకునే ఆచారం వుందని చెప్పింది[37] కాని సౌజన్యారావు తీవ్రమైన అంటీ - నాచ్ మతస్తుడు ఈ విషమ సమస్యను కన్యాశుల్కంలో గురజాడ లేవనెత్తి, పరిష్కారాన్ని రానున్న కాలానికి వదిలిపెట్టారు.

పూర్వసాహిత్యంలోని చింతామణి లాగా మధురవాణి వేశ్యావృత్తిని వదిలిపెట్టి, సర్వసంగ పరిత్యాగంచేసి సన్యాసం పుచ్చుకోదు. వసంతసేనలాగా,

---

36. "హృదయంగమమైన చారుదత్తము సాంఘిక రూపకముల కాద్యోదా హరణ మనదగియున్నది." - మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, "సంస్కృత వాఙ్మయ చరిత్ర"

37 వొంగోలు మునిసుబ్రహ్మణ్యానికి 1909 మే 7న రాసిన ఉత్తరంలో, దీన్ని గురించీ, యిటువంటిదే గ్రీసు దేశపు ఆచారాన్నీ తెలిపారు.

చింతామణిలాగా కాకండా మధురవాణి తన మిగతా జీవితాన్ని మంచిని పెంచేందుకు ఉపయోగిస్తుందన్న సూచన, చివరి రంగంలో స్పష్టంగానే వుంది.

ఆదికాలం నుంచీ వేశ్యలు సమాజ జీవితంలో వొక అంతర్భాగం అయిపోయారు. దేవలోకంలోనూ వాళ్లను పెట్టుకోక తప్పలేదు. దేవుళ్ల కోసం, భూలోకంలో పుణ్యాలు చేసి స్వర్గలోకానికి వెళ్లిన పుణ్యాత్ముల కోసం రంభ మొదలైన వాళ్లను ఏర్పాటు చెయ్యక తప్పలేదు రాజసూయ యాగం చేస్తున్నప్పుడు, "మదమాతంగ తురంగ కాంచన లసత్ మాణిక్య" సంపద లతోపాటుగా, ధర్మరాజుకు సమర్పింపబడిన కానుకల్లో "గాణిక్య సంపదలూ" వున్నాయి ("ఆంధ్ర మహా భారతం"), అంతగా ముఖ్యమైంది, జాతి జీవనంలో వేశ్యా వ్యవస్థ. అంచేత, దాన్ని గురజాడ తన రచనల్లో వొక ముఖ్యాంశం చేశారు. మధురవాణినే కాదు, మంజువాణినీ ("కొండు భట్టీయం"), సరళనూ ("సరస్కర్త హృదయం") సృష్టించారు.

ఇదేకాక, తన డైరీలో 'భోగం పిల్ల' అన్న రచనకు ఆయన రాసుకున్న సూచనలు గురించి, బుర్రా శేషగిరిరావు "శ్రీ గురజాడ అప్పారావు గారి డైరీ"లలో యిలా వ్యాఖ్యానించారు· "భోగము పిల్ల, కథా సూచనను బట్టి చూడగా, యెంతటి నీచపు వృత్తి వారిలోనైనా మంచిశీలమూ, నిలకడా, సుగుణములూ కనబడ వచ్చుననే భావము కన్యాశుల్కము రచించక ముందే ఆయనలో దృఢపడినట్టు స్పష్టమగుచున్నది. మనుష్యులలో మంచి తీసి నజరుగా— లోకోపదేశ జనకముగా నాటకములలో చూపవలయునని ఆయన నిశ్చయించుకొని యుండును."

"మనము చెడ్డయని అనుకొనిన దానిలో కూడ మంచిది ఉండ వచ్చును అను ప్రాథమిక సత్యమును మధురవాణి చరిత్రము నుండి నేర్చు కొంటినని సౌజన్యారావు ప్రకటించెను. ఇతని ప్రకటనయే కన్యాశుల్క నాటక భరత వాక్యము" అనీ, నాటకాదిలో సామాన్య వేశ్యగ కనపడు మధురవాణి, నాటకము ముగియు సరికి మహామానవిగ కన్పడును. ఈ మార్పు ఎట్లు వచ్చినది? మధురవాణి పాత్రోన్మీలనము, కన్యాశుల్క నాటక కళలోని ఇంద్రజాలము" (చూ. "కన్యాశుల్క నాటక కళ").

## విమర్శలు ; సబబైనవి, కానివీ

జీవిత కాలంలోనే కాదు, ఆ తరవాతా గురజాడ మీద పొగడ్తలే కాక తెగడ్తలజల్లులూ కురిశాయి. కాలంచెల్లిన గ్రాంథిక భాషకు బదులుగా వాడుక భాషను కావ్యభాష చెయ్యాలని వాదిస్తున్నందుకు, పేరు చెప్పని వొక గ్రాంథికవాది బెదిరింపులతో ఉత్తరం రాయడమూ, దానికాయన వ్యాసరచ

నకు మచ్చుతునకగా చెప్పవలసిన జబాబివ్వడమూ (చూ. "ఆకాశ రామన్న ఉత్తరాలు") గురజాడ సాహిత్యం పరిచయం వున్నవారికి తెలియని సంగతి కాదు. పాఠశాలల్లో కఠిన గ్రాంథిక తెలుగుకు బదులు సులభ భాషను ప్రవేశ పెట్టాలన్న ఉద్యమానికి ప్రతిఘటన చెలరేగుతూ వున్నప్పుడు ఆయననూ, గిడుగు రామమూర్తినీ (1863-1940), జె. ఎ. ఏట్స్‌నూ (1874-1951), పి. టి. శ్రీనివాసయ్యంగార్‌నూ (1863-1931) దుష్టచతుష్టయం అని పేరుపెట్టి తూలనాడడమూ జరిగింది; గురజాడకు సలక్షణమైన తెలుగు భాష రాయడం చేత కాదు; వాడుక భాషలో రాయడం అంచేతనే. గిడుగుకు తెలుగు భాషా జ్ఞానం శూన్యం. ఏట్స్ ఇంగ్లీషు వాడు. అయ్యంగార్ అరవ వాడు. వీళ్ల నలుగురూ కుమ్మక్కయి తెలుగు భాషను నాశనం చేస్తున్నారు!

కన్యాశుల్కం గురజాడ రాసింది కాదని కొందరు ప్రబుద్ధులు పరిశోధనచేసి కనిపెడితే; యింకొందరు ఘనులు "ముత్యాలసరాలు" యింకెవరో రాశారన లేదు కాని, గురజాడ రచనల అనువాదంలోని లోపాల్ని ఎత్తి చూపే మిషతో ఆయనకు మసి పూయించడానికి తంటాలు పడ్డారు. గురజాడ అడుగు జాడ భావికి బాట అని పదేపదే ఉద్ఘోషించిన శ్రీశ్రీ, అది మర్చిపోయి నవ్యకవిత్వానికి పితృత్వాన్ని ఎవరో తనకుఅంటగడితే, ఆ కుతర్కాన్ని గట్టిగా సమర్ధించడం జరిగింది. ఈ కుతర్కాలకు, అమ్మ కాలవృద్ధికోసం కొన్ని పత్రికలు కొమ్ము కాశాయి. కాలగర్భంలో కలిసిపోయిన యీ "చిన్న కాలపు చిన్నబుద్ధులు" యిప్పుడు తవ్వితీయవలసిన అవసరం వున్నవి కావు.

వివేచన చేయవలసినవి గురజాడ సాహిత్యం గురించీ, కన్యాశుల్కం గురించీ వచ్చిన సద్విమర్శలు. వాటిలో కన్యాశుల్కానికి సంబంధించిన కొన్నిటి పరిశీలన సాహిత్య చింతనకు ప్రస్తుతం అవసరం.

కన్యాశుల్కం "జీవితంతోనూ, మానవత్వంతోనూ పరిపూర్ణమైనది, దానిలోని స్త్రీలు, పురుషులూ దయాదాక్షిణ్యాలతోనూ, విపరీతాలతోనూ, అయుక్తాలతోనూ, క్రౌర్యాలతోనూ, కుయుక్తులతోనూ, పవిత్రతతోనూ, వంచకత్వంతోనూ తిరుగులాడుతారు. ప్రకృతి - ఆచారం, హేతువు - సంప్రదాయం, అభిప్రాయం - చాదస్తం, ఒకదానితో వొకటి తీవ్ర సంఘర్షణకు తలపడ్డ వాస్తవ జీవితంతో యిది నిండివుంది" అని కట్టమంచి రామలింగా రెడ్డి, కన్యాశుల్కానికి కె. కృష్ణయ్యంగార్ చేసినకన్నడానువాదం[38] పీఠికలో చెప్పింది

38. మరికొన్ని యితర భాషల్లో కన్యాశుల్కం: ఇంగ్లీషులో ఎస్. ఎన్. జయంతి, 1964; తమిళంలో ముదునూరు జగన్నాధ రాజు; 1964; రష్యన్లో జోర్యా పెత్రునిఛేవా 1965. ఇదికాక పెత్రునిఛేవా. గురజాడ యితర రచనలు కొన్ని అనువదించి పెద్ద పీఠికతో యిటీవల ప్రచురించారు.

కొద్ది మాటల్లో ఆ నాటకానికి సూత్రీకరణ వంటిది. "లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా?" ("ముత్యాలసరములు") అని, కన్యాశుల్కానికి రెండు దశాబ్దాల తరువాత (1910లో), కవిగా గురజాడ వేసిన ప్రశ్న, కన్యాశుల్కం అంతటా మారుమోగుతూ వుంటుంది.

నాటకం చాలా పెద్దదవడం వల్ల ప్రదర్శించడానికి "అసాధ్యం"గా వుండడం, చిన్న చిన్న రంగాలు అసంఖ్యాకంగా వుండడం, ప్రదర్శనకు చాలా కాలం అవసరమవడం కన్యాశుల్కానికున్న లోపాలుగా పైని పేర్కొన్న పీఠికలో రామలింగా రెడ్డి చెప్పారు. కొన్ని కాళిదాసు నాటకాల్లాగా అది చదివే నాటకమే అయినా, కొన్నికొన్ని భాగాలు ప్రదర్శించడానికి అద్భుతంగా వుంటాయనీ; లోపాలెలావున్నా, కన్యాశుల్కం గొప్ప కళాఖండమనీ ప్రశంసించారు.

రామలింగారెడ్డిలాగే కన్యాశుల్కం గురించి ఎంతో ప్రశంసాభావం వున్న అబ్బూరి రామకృష్ణారావు నూరేళ్లనుంచీ వచ్చిన నాటకాలన్నిట్లో "నానాటికీ అపూర్వంగా కనిపిస్తూ యీ నాటకం ప్రయోగయోగ్యంగా వివిధాధికారాలతో వున్న ఎందరో సామాజికుల్ని రంజింపజేస్తూవుంది"[39] అని చెప్పి, అందుకు కారణాలు యిలా వివరించారు: "యిందులో వున్న యితివృత్తం యీ కాలానికి ప్రస్తుతం కాకపోయినా పాత్రోచితంగా తీర్చిదిద్దిన తెలుగు నుడికారం వుండటంవల్లా, పాత్రపోషణలో సార్వకాలికమైన స్వభావం ద్యోతకం కావటంవల్లా, శూద్రకుడు వ్రాసినమృచ్ఛకటికంలాగా లోకవృత్తాంత దర్శకమైన నాటకంగా తరతరాల వారికి అహ్లాదం కల్పిస్తున్నది. అందువల్ల తరిచినకొద్దీ యేవేవో కొత్తకొత్త తీరుతెన్నులు కనిపిస్తూనే వుంటాయి."

## ప్రదర్శన యోగ్యత

ఇదంతా చెప్పి రామకృష్ణారావు విస్తృతి వల్ల నాటక "ప్రదర్శన యోగ్యత" తగ్గిందన్నారు. సాహిత్య అకాడెమీ గురజాడ గురించి ప్రచురించిన పుస్తకంలో, నార్ల వెంకటేశ్వరరావు యిటువంటి అభిప్రాయమే వ్యక్తం చేశారు.

---

ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలో ప్రచురించే ఆలోచన యునెస్కోకు వుందట. (చూ. యూనిలిట్ గురజాడ శతవార్షిక జయింతి సంచిక, 1965)

39. హైదరాబాద్ గురజాడ శతవార్షిక సంచికలో, తన దర్శకత్వంతో 30-40 ఏళ్ల క్రితం కన్యాశుల్కం వందసార్లకు పైగా ప్రదర్శింపబడిందని ఆయన తెలిపారు.

నాటకకథా గమనానికి దోహదం చెయ్యని కొన్ని రంగాలున్నాయన్న విమర్శకూడా అవకాశం వుంది. మధురవాణి యింట్లో పేకాట, బైరాగితో వున్న రెండు దృశ్యాలు, కోర్టు విచారణ, దాసరి వేషంలో వున్న కరటక శాస్త్రి, శిష్యుణ్ని అగ్నిహోత్రావధాన్లు కొట్టబోయే దృశ్యం, అగ్నిహోత్రావధాన్లు వకీలు నాయుడుతో తగాదాపడి తిట్టి తెగ తెంపులు చేసుకున్న దృశ్యం — యీ రంగాలు కథాగమనానికి అడ్డు తగులుతాయి. ఇవి సరదాగా చదువుకోడానికి, చూడడానికి బాగుంటాయి కాని, కద బిగువును సడలిస్తాయి. అంచేత నాటక ప్రదర్శకులు వాటిని వదిలిపెడుతున్నారు. ఈ రంగాలు, మహాభారతంలో ప్రధాన కదకు అడ్డంగా వుండే ఉపాఖ్యానాల వంటివి

ఇప్పటి నాటక ప్రదర్శనలు ఒకటిన్నర — రెండు గంటలకు, లేదా మూడు గంటలకు పరిమితమై వున్నాయి. కన్యాశుల్కం యీ కాలం కొలతకు యిమిడేది కాదు ; దాని ప్రదర్శనానికి కనీసం ఐదు గంటలన్నా అవసరం కావచ్చు తొలి కోడి కూసేవరకూ వీది బాగవతాలు, తోలుబొమ్మలాటలవంటి వినోదాలు చూడడం వొకప్పటి గ్రామస్తుల అలవాటు. బస్తీల ప్రేక్షకు లంతగా కాకపోయినా, యిప్పటి గ్రామాల ప్రేక్షకులకు కూడా మునపటం తగా వోపికా, తీరుబడీ లేవు

ఈ యిబ్బంది వున్నప్పటికీ, కన్యాశుల్కం దాని వస్తు, సంవిధానాల ఆకర్షణ వల్ల, 1892 లో తొలి కూర్పు తొలి ప్రదర్శన జరిగినప్పట్నుండీ యీనాటి వరకూ, చదువుకునే అద్భుత గ్రంధంగానే కాకుండా, చూసి ఆనందించే గొప్ప నాటకంగా కూడా రాణిస్తూ వుంది.

ఓపిక బట్టీ, తీరుబడిబట్టీ కత్తిరింపులతోనూ, సర్దుబాటతోనూ ప్రదర్శనలు జరుగుతూనే వున్నాయి. సుమారు నూరేళ్లగా, యింత దీర్ఘకాలం, యింత విస్తృతంగా చదివిందీ యింకే గ్రందం లేదనడానికి సందేహించ నక్కర్లేదు.

అయితే పై విమర్శలలో కొంత నిజం లేకపోలేదు. కన్యాశుల్కం మహానాటకంగానే కాదు, మహత్తర కావ్యంగా కూడా రాసింది. పాఠకుల విజ్ఞాన వినోదాల కోసం రాసింది. ఇప్పటి రంగస్థలానికి, ప్రేక్షకులకు తగ్గట్టుగా ఒక శతాబ్దం క్రితపు నాటకం వుండాలనుకోవడం సబబు కాదు. ఇప్పటి కాలానికి తగ్గట్టుగా సర్దుబాట్లు చేసి, దాన్ని ప్రదర్శించుకోవచ్చును. ప్రదర్శకులలా చేస్తున్నారు కూడా.

కన్యాశుల్కాన్ని మొదట రాసేసరికి, తరవాత దాన్ని పెంచి రాసే సరికి దేశంలోనూ, రాష్ట్రంలోను నాటకరంగం ఎంతవరకు ఆధునికంగా వుంది? ప్రేక్షకుల తీరుబడి, అభిరుచి విషయంలో మార్పు వుందా లేదా? గురజాడకు పూర్వుడు ఇబ్సన్ (1828-1904) వంటి ప్రసిద్ధ నాటకకర్తల నాటక ప్రదర్శనలు రాసినవి రాసినట్టుగానే ప్రదర్శింపబడుతున్నాయా?— యీ ప్రశ్నలకు వచ్చే జవాబులు, కన్యాశుల్కం గురించి వచ్చిన విమర్శలకు జవాబులుగా చెప్పవచ్చును.

ప్రపంచ నాటక సాహిత్యానికి పితామహులైన కాళిదాసు, షేక్స్పియర్ వంటివారి నాటకాలు ఆధునిక నాటకరంగం అవసరాల ననుసరించి ప్రదర్శింపబడుతున్నాయి. కన్యాశుల్కం గురించి వచ్చిన అభ్యంతరాల్ని "అభిజ్ఞాన శాకుంతలం", "కింగ్ లియర్", "టెంపెస్ట్" వంటి నాటకాల గురించి లేవనెత్తవచ్చును కదా.

ప్రదర్శనకు ఎక్కువ కాలం అవసరమయ్యే నాటకాలు ప్రేక్షకులు చూడరన్న అభిప్రాయం పూర్తిగా నిజం కాదు. లెవ్ దొదిన్ అనే సోవియట్ నాటక దర్శకుడు 4-5 గంటలు, అంతకు పైగానూ జరిగే నాటక ప్రదర్శనలు చేస్తున్నాడట. "గృహం" అన్న సుదీర్ఘ నాటకం, గ్రామస్తుల జీవితానికి సంబంధించింది, ఆయన ప్రదర్శించబోతోంటే, అది విఫలమవుతుందని అంతమందీ జోస్యాలు చెప్పారు. గ్రామస్తుల జీవితాన్ని నాటకంగా చూసే ఆసక్తి ఎవరికుంటుంది? పైగా దాన్లో 40 నిమిషాలపాటు సాగే స్వగతాలున్నాయి.— కాని ఆ నాటకం జయప్రదమయ్యింది. మాస్కో ఆర్ట్ థియేటర్ ప్రదర్శించిన "గొలవ్యోవ్ కుటుంబం" అన్న నాటకం ఐదు గంటలు జరిగింది. అయినా ప్రేక్షకులు ఆసక్తితో చూశారు "అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు" అన్నది రెండు రాత్రులు ప్రదర్శన జరిగిన నాటకం. అయినా యీ ప్రదర్శనలు జరిగిన నాటకశాలలు కిక్కిరిసిపోయాయి. ఈ సమాచారం తాత్యానా గొర్యఛేవా అన్న సోవియట్ రచయిత్రి "లెవ్ దొదిన్: సత్యాభిలాష నాటకానికి ముఖ్య ప్రేరణగా వుండాలి" అన్న వ్యాసంలో వుంది.

మునపట్లాగ కాకండా, యిప్పటి జీవితంలో తీరుబడి, ఓపిక తక్కువగా వున్నా, ఆసక్తిని రేకెత్తించేలాగా, మనస్సును ఆకట్టుకొనేటట్టూ వుంటే, పెద్దదయినందువల్ల పాఠకులు కాని, ప్రేక్షకులు కాని నిరాకరించరు. లెవ్ టాల్స్టాయ్ బృహత్తర నవల "యుద్ధం, శాంతి"ని చదువుతూనే వున్నారు. "గాన్ విత్ ద విండ్", "రూట్స్" అన్న అమెరికన్ ఫిల్ములు చూస్తూనే వున్నారు. (మొదటిదాని ప్రదర్శన కాలం నాలుగైదు గంటలు రెండోదాని ఆరు భాగాల ప్రదర్శన కాలం పది గంటలు).

ఇప్పుడు సాంకేతిక ప్రావీణ్యానికీ, సామగ్రికీ కొరత లేదు. యూరోపియన్ నాటక రంగస్థలం పైని నిజమని భ్రమ కలిగించేటట్టుగా యుద్ధాలు, తగలబడిపోతోన్న నగరాలు చూపబడుతున్నాయి. "అంగార్" అన్న బెంగాలీ నాటకంలో బొగ్గు గని లోపలికి వెళ్లివచ్చే లిఫ్టు; గని లోపలికి ప్రళయంలాగా నీరు ప్రవహించి లోపల చిక్కుకొనిపోయిన పనివాళ్లంతా దారుణమైన చావుకు గురికావడమూ ప్రేక్షకులు హాహాకారాలు చేస్తూ చూశారు.

అంచేత కన్యాశుల్కంలోని దృశ్యాల్ని చూపడం కష్టమేమీ కాదు. సాహిత్యంలోనూ, కళలలోనూ కొన్నిపాళ్లు భ్రమ కల్పన కూడా వుంటుంది. సమర్థతతో నిర్వహిస్తే, కన్యాశుల్కంలోని స్వగతాలూ అవాస్తవమనిపించవు.

ఈ దేశంలో వృద్ధి కాలేదు కాని, చలనచిత్ర - నాటక కళల మేళవింపుతో కన్యాశుల్కం వంటి నాటకాల్ని పూర్తిగా ప్రదర్శించవచ్చును. చాలా కాలం క్రితం ప్రసిద్ధ నర్తకుడు, ఉదయ్‌శంకర్ యీ ప్రయోగం చేశారు. క్షీర సాగర మథనం వంటి దృశ్యాల్ని కూచిపూడి నృత్య నాటకాల్లో, యీ పద్ధతిని చూపడానికి ప్రయత్నం జరిగింది.

"యీ నాటకమంతా సమగ్రంగా, వున్నదున్నట్టుగా, అన్ని సన్నివేశాలకూ కావలసిన రంగ పరికరాలతో, జాతీయంగా వ్యావహారిక భాషోచ్చారణాన్ని సాధన చేసిన నటవరంతో యెప్పుడో ఒకప్పుడు సలక్షణంగా ప్రయోగించవలసి వుంది. తెలుగు నాటక సంప్రదాయానికి పుష్టినిచ్చే యీ పని చేసి తీరాలి. యూరప్ ఖండంలోని నాటక ప్రపంచానికి యేకైక అధినేతగా పరిపాలించిన ఇబ్సను మహాకవి రచితమైన Peeıognyt కూడా ఇలాటి నాటకమే పాశ్చాత్య సాహిత్యంలో సంప్రదాయ సిద్ధంగా వచ్చిన త్రివిధైక్యాలనూ ఆయన యీ నాటకంలో పాటించలేదు. అందులో కన్యాశుల్కంలో కన్నా రంగాలు యింకా ఎక్కువగా వున్నాయి. అయినా గిల్ గుడ్ అనే ప్రయోక్త యీ నాటకాన్ని ఒక మార్పు కూడా చేయకుండా యెంతో ధనవ్యయాన్ని భరించి పారిస్ నగరంలో చేసిన ప్రయోగాన్ని గూర్చి ప్రఖ్యాత ఆంగ్ల రచయిత స్వయంగా చూసి వర్ణించాడు. అలాటి ప్రయోక్త మన కన్యాశుల్కానికి కూడా రాకపోతాడా అని నా ఆశ"[40] అని అబ్బూరి రామకృష్ణారావు కోరింది అసాధ్యం కాదు.

## "దుర్భడతను ఆకర్షవంతం చేశానా?"

గురజాడకు శిష్యుడు, అప్తుడు అయిన వొంగోలు ముని సుబ్రహ్మణ్యం మీనాక్షి, మధురవాణి పాత్రల గురించి ఆక్షేపణ తెలిపితే, గురజాడ

---

40 "విశ్వవీణ", 1954 డిశంబరు సంచిక.

"నిజమే, మీనాక్షి, కనిపించే దృశ్యాలు అంత నీతిదాయకమైనవీ, ఉపదేశక మైనవీ కా" వని అంగీకరిస్తూ, షేక్స్పియర్ నాటకాల్లోంచి దృష్టాంతాలు యిచ్చారు (1909 మే 21 ఉత్తరం)[41]. అవి నాలుగవ హెన్రీ, మెర్రీ వైఫ్స్ ఆఫ్ విండ్సర్, ఐదవ హెన్రీ నాటకాల్లోని డాల్‌షీర్ షీట్, మైన్ హాస్టెస్, డేమ్ క్లిక్లీ, సర్ జాన్ ఫాల్‌స్టాఫ్ మొదలైన పాత్రలు. ఇవేవీ "ఉజ్జ్వల నైతికశక్తి కలవి కావ"నీ; "వీరిలో ఎవరికీ మర్యాదా మన్నితమూ వున్నట్టు కనిపించ" దనీ, "అవినీతిపరుడూ, కుటిలుడూ అయిన ఫాల్‌స్టాఫ్ షేక్స్పియర్ పద్ధతి హాస్యానికి శిఖరాగ్రం వలె ప్రాతినిధ్యం వహిస్తున్నా" డనీ; అట్వే అనే నాటకకర్త రాసిన "వెన్నిస్ ప్రిజర్వ్‌డ్" అన్నదానిలో వొక వున్నత ప్రభుత్వోద్యోగి అతినీచమైన వొక వుంపుడుకత్తె ముందు పరువు పోగొట్టుకొని తనను తానే క్షూణత పరచుకుంటాడ" నీ గురజాడ తెలిపారు. "వాస్తవ రచనను కళానైపుణ్యంతో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికీ, విధిగా అది కొన్ని లక్షణాలను ప్రస్ఫుటీకరించక తప్పదు" అంటూ నొక్కి చెప్పారు తాను ఒక దోషాన్ని, దుర్నడతను ఆకర్షవంతం చేయలేదన్నారు. కన్యాశుల్కం అకారణంగా యేదో "వొక నైతికోద్దేశాన్ని నెత్తిన రుద్దదు. దానికి మహత్తరమైన వొక నైతిక ప్రయోజనం వుంది" అంటూ," మానవ జీవితంతో నేను చెలగాటం ఆడడం లేనే లేదు. ఎట్టి తృణీకార భావమూ లేకుండా మానవ జీవితాన్ని గంభీరమైన దానిగా భావించి యీ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం హాస్యం తొడికిసలాడేటట్టు యింత గంభీరమైన యితివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పని కాదు"[42] అని తెలియజేశారు.

ఈ సందర్భంగా మొదటి కూర్పులోని మధురవాణి పాత్రను గురించి చెపుతూ, అది "వర్ణింపరాని హేయమైన నడవడి కలది ఆ పాత్రకు ఎట్టి వన్నె చిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్న కొద్దీ మధురవాణి మీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చింది. మదురవాణి పాత్రంటే నాకు నేనే ముచ్చట పడుతున్నాను కనుక చివరి అంకంలో ఆమెను సంస్కరించానని" తెలిపారు.

## గిరీశం పాత్ర, ఔచిత్యం

ఇటువంటివే సందేహాలు, ఆక్షేపణలూ గిరీశం పాత్ర చిత్రణ గురించీ వున్నాయి. శివశంకర శాస్త్రి తన సందేహాన్ని తెలుపుతూ, ముని సుబ్రహ్మణ్యానికి గురజాడ రాసిన ఉత్తరాలు చదివాక, ఆ సందేహం తీరిందని

41 గురజాడ ఆయనకు రాసినవి మనకు తెలిసినంత వరకు 15 ఉత్తరాలు.

42 ముని సుబ్రహ్మణ్యానికి రాసిన ఉత్తరం, 1909 మే 21.

చెప్పారు.[43] బొరన్‌సన్ అనే నార్వే నాటకకర్త నాటకంతో స్పెన్స్‌గార్డ్ అన్న పాత్ర గిరీశం పాత్రలాగ వున్నందువల్ల, దానిని గురజాడ అనుకరించేరేమో అని మొదట శివశంకర శాస్త్రి అనుకున్నారు. కాని గురజాడ ఉత్తరాలలో యిచ్చిన ఉదాహరణలు, సమాధానాలు తెలుసుకున్నాక "నాటకం అంతా స్వకపోల కల్పితం అని స్పష్టమౌతుంది" అని సందేహ నివృత్తి చేసుకున్నారు.

గురజాడ శిష్యుడు, భక్తుడు అయిన బుర్రా శేషగిరిరావు "గిరీశము వంటి నాయకుని పెట్టి, సంఘ సంస్కరణోద్యమమును వేళాకోళములోనికి దించి యుపకృతికి మారు అపకృతియే చేసితిరని నేనొక మారు తెలిసియో తెలియకో సాహసించి యొక సభలో విజయనగరములో నంటిని" అని గురజాడ డైరీల గురించి రాసిన వ్యాసంలో తెలిపారు. కాని గిరీశం నాయక పాత్ర కాదు. దుష్టపాత్రనాయక పాత్ర అవదు. అది వొక ముఖ్యపాత్ర మాత్రం అవును. గిరీశం పాత్ర హాస్యపు పైపూతను దాటి లోలోతులకు పోకపోతే యిటువంటి అవగాహన రాక తప్పదు. మృచ్ఛకటికంలో శకారుని పాత్ర ఎటువంటిదో, అటువంటిదే గిరీశం పాత్ర గురజాడ వెడుగుకు నాయకస్థానం యివ్వలేదు. "తలవరి వలె ముఖము మాడ్చుకొని పీక ఉత్తరించడము నాకు చాతకాదు" అని ఆయన యింకో సందర్భంలో చెప్పారు.[44] గిరీశంకంటె పెద్ద ముద్దాయి అయిన అగ్నిహోత్రావధాన్లకు కాని, రావప్పంతులు వంటి యితర నేరస్తులకు కాని అయన కఠినశిక్షలు వెయ్యలేదు, నవ్వులపాలు చేశారు. అప్పటి సంఘ సంస్కరణోద్యమంలో, యిప్పటి మంచి ఉద్యమాల్లోలాగానే మోసగాళ్లుండేవారు. అటువంటి వాళ్ల బండారాన్ని ఆయన "కొండుభట్టీయం" లోనూ బయటపెట్టారు [45] సమాజ శ్రేయస్సుపట్ల బాధ్యతవున్న వాళ్లు చేయక తప్పని విధి అది కన్యాశుల్కంలోని హాస్యం వెనకవున్నవి తీవ్రాతితీవ్ర విషయాలు.

సంఘసంస్కర్తలాగా నటించిన ఒక పీడపురుగు గిరీశం, అంతశ్శత్రువు. ఆ అంతశ్శత్రువును ఎండగట్టడానికి నాటకకర్త ఎందుకొన్నది. హాస్యరసం. "కొండుభట్టీయం" లోని కుహనా సంస్కర్తల చిత్రణకు ఆయన ఎంపిక చేసిన హాస్యరసపు రంగు, గిరీశం విషయంలో లాగా ముదురు పాకానిది కాదు. సంఘ సంస్కరణోద్యమంలో దాక్కొని వున్న దోషుల్ని, దొంగల్ని కానక పోవడం, దానికి మేలుచేయడం అవదు కన్యాశుల్కం

43. "జ్వాల", 1934 డిసెంబరు 16.

44. చూ. "ఆకాశ రామన్న ఉత్తరాలు" అన్న వ్యాసం.

45 కేశవ రాయుడు, దివాన్‌బహద్దర్ రాజారాం అన్న పాత్రలు

పాఠకుడైనా, ప్రేక్షకుడైనా మెచ్చేది సౌజన్యారావును, అంతకంటె మధుర వాణినీ. కాని గిరీశాన్ని, అగ్నిహోత్రావధాన్లునీ ఎంతమాత్రమూ కాదు.

శూద్రకుని శకారుడు, షేక్స్‌పియర్ షైలాక్ పాత్రలు నవ్వు పుట్టించే పాత్రలు, కాని ప్రాణహానికి తలపడ్డ పాత్రలు. గోగోల్ పాత్ర, ఇన్స్‌పెక్టర్- జనరల్ పెద్ద దగాకోరు. ఛార్లీ చాప్లిన్ ఫిల్ము పాత్రలు మొషె వెర్డె, హిట్లర్ హంతకులు. వీళ్లంతా హాస్యపాత్రలుగా కనిపించి నవ్వు పుట్టిస్తారు. మన కళ్ల ఎదట నడుస్తున్న జీవితంలోనూ యిటువంటి వాళ్ళు తరచు కనిపిస్తుంటారు. కొందరికి ఆటకట్టయినా, యింకా అవకపోయినా, వాళ్ళు తమ పాప ఫలాంత వైభవంతో మనకి వినోదం కలిగిస్తూ వుంటారు. కాని అనుసరించ తగ్గ ఆదర్శ పురుషులువరు. గిరీశం వంటి పాత్రలకూ వర్తించే దిదే - వీళ్లెవరి మీదా గురజాడ కోపాలు, శాపాలూ కురిపించ లేదు. అది ఆయన పద్ధతి. ఆయనది "తలవరి" పద్ధతి కాదు.

కన్యాశుల్కానికి కథానాయకుడు గిరీశమనుకున్న వాళ్లు వున్నట్టుగానే, ఆ పదవిని సౌజన్యారావుకు, కరటక శాస్త్రికి యిచ్చినవాళ్లున్నారు. నాటక కథలో అదృశ్యంగా వున్న వీరేశలింగమే కథానాయకుడన్న వాదనా వుంది. అయితే కన్యాశుల్కానికి కథానాయకుడున్నాడా ? ఉన్నట్టయితే, నాటక కర్త ఉద్దేశించిదెవర్ని ?

"నాయిక లేని నాటకం" అని గురజాడ 1896 ఏప్రిల్ 26 డైరీలో రాశారు. ఇది దేన్ని గురించి రాసిందీ ఊహకందని విషయం. గురజాడ నాటకం "నాయిక లేని నాటకం" యెంత మాత్రమూ కాదు. నాయిక మధుర వాణి అని స్పష్టమే. కాని నాయకుడి విషయమే సందేహం. "నాయిక లేని నాటకం" సాధ్యమైనప్పుడు, నాయకుడు లేని నాటకం ఎందుకు సాధ్యం కాదు? నాటకానికి నాయక పాత్ర తప్పనిసరిగా వుండాలన్న అలవాటును తప్పించడానికిలా ఆయన చేశారేమో.

## నివురు కప్పిన నిప్పు

కన్యాశుల్కం నాటక స్వభావాన్ని పలువురు పలువిధాలుగా నిర్ణయించారు. రసచర్చ చేసి, తమకు తోచిన నిర్వచనాలు చేశారు. అది విషాదాంత నాటకమనీ, ఖేదమోదాంత నాటకమనీ తలోకవిధంగా అన్నారు. అది ఉత్త ఫార్స్ అని తోసి పారెయ్యడమూ జరిగింది. నాటకకర్త చెప్పిందాని ప్రకారం, అది హాస్యరస ప్రధాన నాటకం. కాని యివేవీ కన్యాశుల్కాన్ని జాగ్రత్తగా సమగ్రతలో తూచి విలువ కట్టిన వాటిగా కనిపించవు.

విషాదాంతం, ఖేదాంతం అనడానికి ఆస్కారం కనిపించదు. అది అగ్ని హోత్రావధాన్లు, గిరీశం, రామప్పంతులు వంటివాళ్లకుమాత్రమేవిషాదాంతం, ఖేదాంతం దుష్టులకు ఆట కట్టయి ముగిసిన నాటకం ఆ దుష్టులకు మాత్రమే విషాదాంతం. సౌజన్యారావు, మధురవాణి, కరటక శాస్త్రి వంటి సన్మార్గులకు అది మోదంతం. ఫార్సుగా కొట్టిపారేసిన వాళ్లలో పెద్దవాళ్లూ వున్నారు. ప్రపంచ స్థాయి ఉత్తమ సాహిత్యమని విజ్ఞులు ఎంతోమంది మెచ్చిన దానిని ఫార్సుగా చెప్పడం సమంజసం కాదు. హాస్యరస ప్రధాన నాటకమని, నాటకకర్త చేసిన ప్రకటనే అయినా, అది అర్ధసత్యమే. ఎంచేతనంటే, కన్యాశుల్కం నివురు కప్పిన నిప్పు. దాన్ని కప్పి వున్నది హాస్యమనే నివురు. దానికి దిగున నిగూఢంగా వున్నది, నిప్పువంటి బీభత్సం. అంచేత, కన్యాశుల్కం, బీభత్స రసప్రధానమైన హాస్యనాటకమవుతుంది. అగ్నిహోత్రావధాన్లు చేసిన నర మాంస విక్రయ కథను చెప్పింది బీభత్సం కాక మరేమిటి?

ఈ నాటకం మీద కొత్త వెలుగును ప్రసరింపచేసి, దాని అంతస్సా మిటో చెపుతూ, అయ్యల సోమయాజుల నరసింహ శర్మ "..  హాస్యం వికా సాత్మకమైన విజ్ఞానానికి కారణం. ఉత్తేజం విప్లవానికి కారణం, సంఘం తన లోపాన్ని గ్రహించి విజ్ఞానవంతమైనది అయితే గాని, విప్లవం జరపడానికి అర్హమైనది కాదు. కాబట్టి సంఘం అజ్ఞానావస్థలో వున్నప్పుడు ముందు విజ్ఞా నాన్ని కలిగించాలి. హాస్యం ఇందుకు తోడ్పడుతుంది. అంచేత హాస్యంతో పాటిందు బీభత్సం చూపబడ్డది. విజ్ఞానం విప్లవానికి పూర్వరూపం. విజ్ఞాన వంతుడే గాని మధుర హాస్యాన్ని అర్థం చేసుకోలేడు"[46] అని రసచర్చ చేసి కన్యాశుల్కం బీభత్సరస ప్రధానమైన నాటకమని సరైన మౌలిక నిర్వచనం చేశారు. ఈ నిర్వచనం బావ చౌర్యానికి గురికావడం శోచనీయం

కన్యాశుల్కంలోనిది, హాస్యమనే తేనె పూసిన కత్తి. ఈ పైపూతకు దిగువ అంతటా వ్యాపించి, సమాజాన్ని అన్నివిధాలా దిగుజార్చుతూ వున్న బీభత్సాన్ని కానకపోవడం, సబబు కాదు. అప్పటి సమాజంలో నిరాటకంగా సాగిపోతోన్న గొంతుకలు కోసే వ్యాపారాన్ని సన్నితమైన హాస్యంతో మేళ వించి చిత్రించడం, కన్యాశుల్కం సాధించిన అసాధ్యమైన కళ. ఈ కళలోని రంగురంగుల వ్యంగ్య చిత్రాలకు ప్రతిరూపాలు — ఆనాటి దుర్నీతి; మూఢవిశ్వాసాలు; వంచకత్వం; పాత క్రొత్త సంస్కారాల సంఘర్షణ; కొత్త సంస్కారంలో దాక్కొని వున్న విష బీజాలు; నీతికోసం, న్యాయకోసం ప్రయత్నాలు; పరోపకారబుద్ధి; పెంపొందుతూ వచ్చిన చిత్త సంస్కారం, అగ్ని సంస్కారం జరిగేవరకూ మారని మనుషుల మనసులు .

46. చూ. "తెలుగు తల్లి", 1945 ఏప్రిల్ సంచిక.

## "అవినీతి క్రిములు", అహేతుకాలు

గత శతాబ్దం చివరి దశాబ్దాల జీవితానికి, నాటక రూపంలో వున్న సాంఘిక చరిత్ర, కన్యాశుల్కం. అది కాలం చెల్లిన పూర్వ నాగరికత వికృత రూపాల్ని చూపింది ; వేరూనుతూ వున్న కొత్త నాగరికతా సంస్కారాలు వెర్రితలలు వేస్తోన్న తీరుతెన్నులు తెలిపింది. చారిత్రక కారణాల వల్ల మారుతూవున్న సమాజాన్ని, ఆ పరిణామంలో జరుగుతూవున్న సంఘర్షణల్నీ కళ్ల ఎదట నిలిపింది. పూర్వ నాగరికతా సంస్కారాలకు ప్రతినిధులు అగ్నిహోత్రావధాన్లు వంటి వాళ్లయితే, కొత్త నాగరికతా సంస్కారాలు వేస్తోన్న వెర్రి తలలకు ప్రతిరూపాలు గిరీశం వంటివాళ్లు. ఇటువంటి పాత, కొత్త భ్రష్టుల ఆట కట్టించడానికి పూనుకున్నవాళ్లు మధురవాణి, సౌజన్యారావు, కరటక శాస్త్రి. మొదటి యిద్దరివీ నిష్కామ కర్మలు. కరటక శాస్త్రిది ఆపద్ధర్మం ; లుబ్ధావధాన్లకును తన కూతుర్నిచ్చి పెళ్లిచేసే ప్రయత్నం మానుకోకపోతే నూతిలో పడతానంటూన్న తన చెల్లెలి ప్రాణరక్షణ కోసం.

ఇప్పట్లాగే, హెచ్చు తగ్గులుగా సంఘంలో, అప్పుడూ సర్వత్రా అవినీతిక్రిములు వ్యాపించి వుండేవి. ఈ అవినీతిక్రిములు న్యాయ వ్యవస్థ నెలా అన్యాయ వ్యవస్థగా దిగజార్చాయో తెలిపే ఒక ఉదంతం : "మనం తెచ్చిన దావా, లంచం పుచ్చుకొని మున్సబు అన్యాయంగా కొట్టేశాడు మా వకీలు అవతల పార్టీ దగ్గిర కతికి మన కేసు ధ్వంసం చేశాడు". ఈ మాటలు (అగ్నిహోత్రావధాన్లువి) "న్యాయమూర్తులు", "న్యాయవాదులు" ఎంత న్యాయంగా వున్నదీ తెలుపుతాయి.

"నాలుగు రాళ్లు" తడుముకుందామని, హెడ్ కాన్‌స్టేబుల్ లుబ్ధావధాన్లు మీద ఖూనీ కేసు బనాయిస్తాడు. తరవాత తాసీల్దారు రంగంలో ప్రవేశించి, "పది రాళ్లు" లాగుతాడు

ధనరూపంలో కాక, "వస్తురూపంలో" ఉన్నతోద్యోగి అవినీతి ముచ్చటొకటి : డిప్టీ కలక్టరు "లంచం తినడు గాని ఆయనకు స్త్రీ వ్యసనం కద్దు." ఆయన మధురవాణికి "నాయుడు (వకీలు) చేత రాయబారాలు పంపుతున్నాడు." ఆయన అభీష్ట సిద్ధికి మధురవాణి సహకరిస్తే, తన చిక్కుల్నుండి బయట పడవచ్చునన్న ఆశతో కరటక శాస్త్రి ఆమెను డిప్టీ కలక్టరు దగ్గిరకి వెళ్లమని వేధించడమూ ; తనను చిత్రగుప్తుడి దగిరకి పంపి "చేసిన పాపాలు అన్నీ తుడుపు పెట్టించడానికి వీలుండదు కాబోలు" అంటూ మధురవాణి కరటక శాస్త్రికి చీవాట్లుపెట్టి "తల వాయట్టగొ"డమూ జరిగింది.

మీనాక్షి భ్రూణహత్యలు చేసుకున్నప్పుడల్లా "పోలీసులు బెదిరించి పది డబ్బుల సొమ్ము" లాగేస్తూంటారు.

ఖూనీ కేసు బెదిరింపుతో, హెడ్ కాన్‌స్టబుల్ తాను లుబ్ధావధాన్లుకు రాసి యిచ్చిన దస్తావేజు కాగితం లాగేసుకుంటాడు.

పోలీసు ఇన్‌స్పెక్టరుకి యిస్తానన్న సాకు చెప్పి, రామినాయుడి దగ్గిర్నుంచి రావప్పంతులు పాతిక రూపాయలు కాజేస్తాడు.

ఆ రావప్పంతులే "యీ ఇన్‌స్పెక్టరు గాడికి యీ తాలూకాకి వచ్చిం తరువాత అయిదారు వేలు యిప్పించా" నని తన ప్రజ్ఞను చాటుకుంటాడు. తాను ఎంతటి ఘనుడంటే, "యీ తాలూకాలో సివిల్ మేజస్ట్రేట్లు ఎక్కడొచ్చినా రావప్పంతులు పప్పులేని పులగం వుండదు." అంతే కాదు, మూడేళ్ళ క్రితం మైనార్టీ దాటిన వాణ్ని "మైనరని వాదించ" మంటాడు.

ఆ రోజుల్లో కోర్టుల్లో దొంగ సాక్ష్యాలు చెప్పడానికి మనుషుల హెూదాల్ని బట్టి రేట్లుండేవి. కుండలాలున్న పండితులకైతే రేటు ఒక రూపాయి. ఇటువంటి సాక్ష్యాల గురించే పోలిసెట్టి సలహా : " . బాపనోళ్లు నచ్చాప నచ్చలు. కొంచం సెయి తడిచేస్తే సాచ్చీకం చెప్పి పోతారు."

దొంగ సాక్ష్యాల గురించి సౌజన్యారావు ఆక్రోశం : "పెద్ద పెద్ద వకీళు కూడా సిగ్గుమాలి బరిపెట్టి దొంగ సాక్ష్యాలు పాఠం చెపుతారు నావంటి బాదస్తులం యింకొక కొందరం అటువంటి పాపానికి వొడిగట్టుకోం గాని మా పార్టీల తరపు సాక్షులు కూడా అబద్ధం చెబుతున్నారని యెరిగిన్నీ వూరుకుంటాం".

అగ్నిహోత్రావధాన్లు పూర్వాచార పరాయణుడొక్కటే కాదు, వేదం ఎనభై రెండు పన్నాలు అధ్యయనం చేసిన పండితుడు కూడా. అయితే యివేవీ కూతుళ్ల జాతకాల బకాయింపుకు అడ్డంకులు కావు, అతను చిన్న కూతురు జాతకం బనాయింపు చేయడం గురించి చెప్పి, రావప్పంతులు ఒక సర్వసాధారణ విషయం బయట పెడతాడు, "మా బ్రాహ్మల్లో యిది సరిపాటే పెళ్లిళ్లలో పంపించేది ఒక జాతకవూ౽ నిజం వుండదు" అని. ఇదే కాదు, అగ్నిహోత్రావధాన్లు బండారం అందరి ముందర కోర్టులో కూడా బయటపడింది పెద్ద కూతురు జాతకంలో పుట్టిన సంవత్సరం వొకటైతే, సాక్ష్యంలో చెప్పింది యింకొకటి. ఇందువల్ల చీవాట్లు తిన్నాడు.

సిద్ధాంతులు లంచం తిని, పెళ్లి లగ్నాలు ఎప్పటికి కావలిస్తే అప్పటికి నిర్ణయించేస్తారు.

"కొత్త జాతకాలు నిర్ణయించడం ఐదు నిమిషాల పని". ఇందుకోసం అటక నిండా పాత తాటాకులు కాగితాలు, నిలవచేసి వుంటాయి. రకరకాల సిరాలూ వుంటాయి.

కాశీలో పొద్దుటి పూట బయల్దేరి వాయువేగ మనోవేగాలతో, కొద్ది గంటల్లో ఆకాశ మార్గాన విశాఖపట్నం వచ్చాననని బైరాగి చెప్తాడు. రాగితో బంగారం చేసి యిస్తానంటాడు. అంజనం వేసి పారిపోయిన (మొగ) పెళ్లికూతురు ఎక్కడున్నదీ కనిపెట్టేస్తానంటాడు ... ఈ పచ్చి అబద్ధాల్ని అందరూ నమ్మేవాళ్లే! "ఆరు నెలల్లో ఇంగ్లీషు. బావుటా పోతుం" దన్న పరమ రహస్యం చెపుతాడు. భక్త కోటి నమ్మేస్తుంది. ఎవరికీ తెలియని భాషలో బంగారం రేకు మీద రాసివున్న దైవభాషను తాను చదివానంటాడు. ఇలాటివే తన మహత్యాలనేకం చెపుతూపోయి, గంగా నదిని సారా నదిగా మార్చేశానంటాడు. "కనుక్కో గలిగిన గ్యానికి గంగా నది సారాయి కాదా!" అని ఉపదేశించి, భక్తులకు పారవశ్యం కలిగిస్తాడు.

బోనులో ఎలకల్ని పట్టినట్టు దయ్యపు దంపతుల్ని సీసాలో బంధిచా నని భూత వైద్యుడు ప్రకటిస్తే అందరూ నమ్ముతారు. అందువల్ల, దయ్యా ప్పిల్లలు పుట్టవచ్చు నన్న వొక అమోఘమైన ఊహ ఒక పాత్రకు వస్తుంది కూడా, "నమ్మి చెడిన వారు లేరు, నమ్మక చెడిపోతే పోయేరు" అన్నది అప్పటి సర్వసాధారణమైన నమ్మకం.

సనాతన ధర్మం అనుసరిస్తున్నట్లు నటిస్తూ, రకరకాల అబద్ధాలాడుతూ, రకరకాల దుశ్చేష్టలు చేస్తూ; ఆత్మ వంచన, పర వంచనచేసే అగ్నిహోత్రావ ధాన్లు, సిద్ధాంతి, గవరయ్యవంటి వాళ్లూ; అభ్యుదయ కాముకులైన అధుని కులుగా చెలామణీ అయ్యే దగాకోర్లు యిప్పటంతగా కాకపోయినా, అప్పుడూ ఏమంత తక్కువగా లేరు. అప్పటి దుస్సహ పరిస్థితులపైని, సాహిత్యంలో కనీ వినీ ఎరగని పెద్ద దండయాత్ర, కన్యాశుల్కం. ఇప్పటి దుస్సహ పరిస్థి తుల పైని, సాహిత్య సమరానికది మార్గదర్శి.

## రెండు కూర్పులు

ఇంగ్లీషు కవిత్వం నుండి బయటపడి, సాంఘిక పరివర్తనకు తెలుగు భాషా సాహిత్యాల్ని సాధనం చెయ్యాలన్న తపన, కన్యాశుల్కం రచనకు ప్రోద్బలం అయ్యింది. అదే గురజాడ తొలి తెలుగు రచన. దాని యితి వృత్తం ఎంపికకు భావ ప్రాతిపదికగా వున్నవి, ఆనంద గజపతి సేకరించిన కన్యాశుల్క వివాహాల సంఖ్యా వివరాలు, వాటిని అరికట్టడానికి ఆయన మద్రాసు శాసన సభలో ప్రతిపాదించ దలుచుకున్న బిల్లు, "కన్యాశుల్క

ఖండన"[47] అన్న వీరేశలింగం వ్యాసం (అగ్నిహోత్రావధాన్లు మనస్సు మళ్లించడానికి గిరీశం పూనుకుందా మనుకున్నప్పుడు, యీ వ్యాసం ప్రస్తావన వస్తుంది). ఇవి కాకండా, యీ విషయం మీద వీరేశలింగం రాసినవి "బ్రాహ్మ వివాహము" అన్న పెద్ద ప్రహసనం (1878), "కన్యా శుల్కము" అన్న చిన్న ప్రహసనమూ వున్నాయి. మొదటి కూర్పు రాసిన తరవాతనే తాను "బ్రాహ్మ వివాహము" చదివినట్టుగా, దాని పీఠికలో గురజాడ తెలిపారు చిన్న ప్రహసనాన్ని ఆయన చదివిందీ లేందీ తెలియదు. వీరేశలింగం ప్రహసనాలకు, గురజాడ కన్యాశుల్కానికీ కథా వస్తువు వొకటే కాబట్టి, కొన్నిచోట్ల పోలికలుండడం సహజం. కాని పాత్ర పోషణ, సం విధానం మొదలైనవి చాలా భిన్నంగా వున్నాయి. అయితే వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమం అంతట్లాగనే, కన్యాశుల్క వివాహాల గురించి ఆయన అందోళన ప్రభావమూ గురజాడ పైని పడడం సహజం. గురజాడ యీ సమస్య వొక్కటే కాకండా, తన కన్యాశుల్కంలో విధవా వివాహ సమస్యనూ, వేశ్యావృత్తి సమస్యనూ ఉపాంగాలుగా చేశారు

తొలి కూర్పు ప్రదర్శనకు, ప్రచురణకు పెద్దగా ప్రశంసలు వచ్చాయి. (చూ. పీఠికలు, సమీక్షలు). తొలి ప్రదర్శన తరవాత 17 ఏళ్లకు. తొలి ముద్రణ తరవాత 12 ఏళ్లకు గాని ఆయన రెండో ముద్రణకు పూనుకోలేదు. చిన్న చిన్న మార్పులతో సరిపెట్టుకుందా మనుకున్నారు. కాని తన మిత్రుడు, ఎస్. శ్రీనివాసయ్యంగార్ (1874 - 1941, ప్రసిద్ధ న్యాయవాది, 1926 గౌహతి కాంగ్రెస్ మహాసభాధ్యక్షుడు) చేసిన సూచనను పాటించి, కన్యాశుల్కాన్ని "మళ్లీ పోత" పోశారు. ఇది ఏవిదంగా జరిగిందీ చెపుతూ, "కన్యాశుల్కాన్ని చాలా మార్పు చేశాను .. మూడంకాలు అచ్చుకు వెళ్లాక కొన్ని పాత్రల గురించి నా భావాల్ని మార్చుకోవలసి వచ్చిం" దని, "విషయాన్ని పక్కకునెట్టి చెప్పాలంటే, దాన్ని మహత్తర గ్రంథం చేశాననుకుంటున్నాను. గీటురాయి ఏమిటంటే, నన్నే అది మురిపించుతూ వుంది. మొదటి కూర్పు కంటె యిది ఎక్కువ కూలంకషంగా నా మనస్సును వెల్లడిచేస్తూవుంది"[48] అని తెలిపారు. భాసుని చారుదత్తానికి శూద్రకుడు తన మృచ్ఛకటికంలో చేసిన మార్పుల కంటే, గురజాడ రెండో కూర్పులో చేసిన మార్పులు పెద్దవి.

రెండు కూర్పులు సరిపోల్చి చదువుతూ వుంటే, యీ మార్పు లెటు వంటివో తెలుస్తుంది. అంకాలు, రంగాలు, పాత్రలు, పుటలు, ఘటనలు

---

47. చూ. పాద పీఠిక 5.
48. వొంగోలు ముని సుబ్రహ్మణ్యానికి 1907 మార్చి 14, మే 7 ఉత్తరాలు

మొదలైనవి పెరగడమే కాదు; నాటక మంతటా నాణ్యం పెరిగింది, అంద చందాలు అమిరాయి— అవి నాటకకర్తనే "మురిపించి" నటువంటివి.

మొదటి కూర్పులోని గ్రాంథిక భాష వాసనలు రెండోదాన్లో లేవు. వేరు వేరు పాత్రలు తమ తమ బుద్ధుల్నిబట్టి, సంస్కారాల్నిబట్టి అచ్చమైన వాడుక నుడికారాల్తో, ఉచ్చారణలతో, పలుకుబళ్లతో మాట్లాడుతాయి. అగ్ని హెూత్రావధాన్లు, కరటక శాస్త్రి, గిరీశం, సౌజన్యారావు, పోలిసెట్టి, అసిరిగాడు, వెంకమ్మ, బుచ్చెమ్మ, మీనాక్షి మొదలైనవారి మాటలు సరిగ్గా వారి వారి తీరుల్నిబట్టి, మనస్సుల్నిబట్టి వుంటాయి. మచ్చుకు మీనాక్షి మాటలు: దయ్యపు దంపతులు "యిద్దర్ని వో సీసాలో పెడితే దెయ్యప్పిల్లలు పెడతా రేమో". లుబ్ధావధాన్లు కొత్త "పెళ్లికూతురు" రెండో పెళ్లి పిల్లేమో అన్న అనుమానం వచ్చి కనుక్కోమంటే, మీనాక్షి "నన్ను అడ్డమైన మాటలూ అంటూంటే నేనెందుకు అడుగుతానూ ? నేను దాంతో యిగ మాట్లే అణ్ణు" అంటుంది.

మొదటి కూర్పులో పొటిగ్రాపు పంతులు బంట్రోతు తన సంస్కారానికి అందని "భవిష్యం" అన్న మాట ప్రయోగిస్తాడు. ఈ కూర్పులోందే హెూకర్ పాత్ర కూడా, ముస్లిం యాసతో యీ మాటనే ప్రయోగిస్తాడు. ఇది యీ పాత్రల నోటికి వచ్చేది కాదు. అంచేత రెండో కూర్పులో అది లేదు. బూటకపు పెళ్లికూతురు దూబరా ఖర్చులు చూపడానికి కల్పించిన హెూకర్ పాత్ర వున్న రంగమే తొలగించబడింది.

వేరు వేరు మనుషులే కాదు, వొకే మనిషి సైతం వొకే మాటను వేరు వేరుగా పలకడమూ జరుగుతూ వుంటుంది. ఇది రెండో కూర్పులో ఎక్కువగా కనిపిస్తుంది. ఉదా: కరటక శాస్త్రి, కరటక శాస్తులు, కరటక శాస్తుల్లు; లుబ్ధావదాన్లు లుబ్ధావధాల్లు మొదలైనవి.

మొదటి దాన్లోని కాన్‌గ్రెస్, కాంగ్రెస్ అయ్యింది, మొదటి యంకము ప్రథమాంకము అయ్యింది.

మొదటి కూర్పులో "సాయంకాలమైనది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెట్టుతానని నెల రోజులైనది" అని మొదలైన నాటకం, "డామిట్! వ్యవహారం అడ్డంగా తిరిగింది" అన్న వాక్యంతో ముగుస్తుంది. రెండో కూర్పు "సాయంకాలమైంది. పూటకూళ్లమ్మకు సంతలో సామాను కొనిపెడతానని నెల రోజుల కిందట .." అన్న మాటలతో మొదలై, "డామిట్! కథ అడ్డంగా తిరిగింది!" తో ముగుస్తుంది. మొదటి కూర్పులో పూటకూళ్లమ్మ గిరీశానికి యిచ్చింది పది రూపాయలైతే, రెండో దాన్లో యిరవై రూపాయలు.

రెండో కూర్పులోని మధురవాణి పాత్ర, మొదటి కూర్పులో మహాలక్ష్మి, మధురవాణి అన్న రెండు పాత్రలుగా వుంది. మహాలక్ష్మి గిరీశం వేశ్య, మధురవాణి రామప్పంతులు వేశ్య. మహాలక్ష్మి రెండుసార్లు ప్రస్తావనకు మాత్రం వస్తుంది, రంగంలోకి రాదు. మొదటి కూర్పులోని యీ రెండు పాత్రలూ కేవలం "కొయ్యబొమ్మలు"; రెండో కూర్పులోని మధురవాణి పాత్ర "సౌరు" రవ్వంతైనా లేనివి.

మొదటి కూర్పులో, వెంకమ్మ కాలుజారి నూతిలో పడితే, గిరీశం పైకి తీసినట్టుగా వుంది. రెండో కూర్పులో, కూతుర్ని డబ్బాశతో ముసలి వాడికిచ్చి పెళ్లి చేస్తున్నందువల్ల, ఆత్మహత్య చేసుకోడానికి వెంకమ్మ నూతిలో దూకితే, గిరీశం రక్షించినట్టు మార్చి నాటకకర్త కథకు పుష్టి నిచ్చారు.

ఒకటో కూర్పులో రామప్పంతులు నియోగి కాడు, వైదీకి. మొదటి దాన్లో రెండో రంగం అగ్నిహోత్రావధాన్లు యిల్లు; రెండో కూర్పులోలాగా మధురవాణి యిల్లు కాదు. అంచేత మంచం కింద ముచ్చట వుండదు.

పెళ్లికి ముందర నిరాహారం వల్ల లుబ్ధావధాన్లుకు ప్రాణాంతకం కావడం, పెళ్లి భోజనాల కొచ్చిన తిండిపోతు భోక్తల దౌర్జన్యం గురించీ వున్న మొదటి కూర్పు రంగాలు, రెండో కూర్పులో తీసివెయ్యబడ్డాయి.

మొదటి కూర్పులో శిష్యుడు భట్టీ వేస్తోన్న శ్లోకం రఘువంశంలోని దయితే, రెండో కూర్పులోనిది కుమార సంభవంలోంది. "లేళ్లు పరిగెడితే ఎవడిక్కావాలి, పరిగెత్తకపోతే ఏవడిక్కావాలి" వంటి వ్యాఖ్యానాలు, కాళిదాసు కవిత్వానికి చేసిన వెటకారాలు, శిష్యుడి పాత్రను రక్తికట్టించడానికి చేసిన మార్పులు.

మొదటి కూర్పులో రామప్పంతులు బనాయించిన ఉత్తరాన్ని కూలి వాడు తెచ్చి యిస్తాడు (తెచ్చినందుకు భత్యం యివ్వాలి). రెండో దాన్లో ఆ ఉత్తరం పోస్ట్‌మన్ బట్వాడా చేస్తాడు. తపాలా వ్యవస్థలో మార్పును, యీ మార్పు సూచిస్తుంది.

తన కంటెను తెచ్చి యిమ్మని వేధిస్తోన్న మధురవాణిని బ్రతిమాలుతూ కాళ్లు పట్టుకోబోతోన్న రామప్పంతుల్ని, సత్యభామ అవతారమెత్తి మధుర వాణి తన్నివేయడం— తొలి కూర్పులో వున్న యీ కోపమో, మోటు సరసమో మలి కూర్పులో లేదు.

ఈవిధంగా రెండో కూర్పులో ఆదినుండి అంతం వరకూ చేర్పులు, మార్పులు, తొలగింపులూ ఎన్నో వున్నాయి నాటక కర్త రెండో కూర్పులో చెక్కిన లెక్కలేనన్ని నగిషీలు, పెట్టిన మెరుగులు కన్యాశుల్కాన్ని మహత్తర గ్రంథంగా రూపొందించాయి. ఫలితంగా అది రంగు రంగుల ఇంద్ర ధనస్స య్యింది, ఇంద్రజాలమయ్యింది.

## సిద్ధహస్తుని సాటిలేని పాత్ర

అన్నిటి కంటె మనోహరమైందీ, మహత్తరమైందీ మధురవాణి పాత్ర చిత్రణ. మొదటి కూర్పు మధురవాణి రావప్పంతులు వెలయాలు మాత్రమే. రెండో కూర్పులో, వెలయాలుగా ప్రవేశించిన మధురవాణి, వెలలేని పాత్రగా పరిణమించింది.

"కొద్ది కాలం వుండే యవ్వనాన్ని జీవనాధారం చేసుకున్న కులం"లో పుట్టి పెరిగిన మధురవాణి, ఆ వృత్తిని విచ్చల విడిగా కాకుండా, తన తల్లి చేసిన ఉపదేశాల పరిమితుల్లో సాగిస్తూ వచ్చింది. మంచి వారిపట్ల మంచి గాను, చెడ్డవారి పట్ల చెడ్డగానూ వుండమనీ; చెడని వారిని చెడగొట్ట వద్దనీ ఆ ఉపదేశాల సారాంశం. మధురవాణికవి మార్గదర్శకాలు.

మధురవాణి పరిణామం, మొదట కటక శాస్త్రితోనూ, తరువాత సౌజన్యారావుతోనూ సంభాషణల్లో స్పష్టమవడం మొదలవుతుంది. సుబ్బితో లుబ్ధావధాన్లు పెళ్లిని తప్పించమని రావప్పంతుల్ని మధురవాణి వేధించ డానికి కారణం స్వార్థం కాదు అది సత్కార్యం అయినందువల్లనే. పెళ్లి తప్పించడానికి కరటక శాస్త్రి పథకం తెలియకముందర్నుంచి "ఆ ముసలాడికి పెళ్లెందుకు ? పెళ్లి మానిపించెయ్యండి" అని రావప్పంతులు చెవినిల్లు కట్టు కొని పోరుతుంది. "ఈ పెళ్లి తప్పించకపోతే మీతో మాట్లాడను" అని మారాం చేస్తుంది. పెళ్లి బేరానికి మారువేషాల్తో కరటక శాస్త్రి, అతని శిష్యుడు తన దగ్గరకి వచ్చేవరకూ, సుబ్బి కరటక శాస్త్రి మేనగోడలని మధుర వాణికి తెలియనే తెలియదు. ఈ అంతర్నాటకంలో మధురవాణి ప్రవేశం, కేవలం నిష్కామ కర్మ. "కష్టపడి ఆర్జించిన" తన కంటెను, అది తిరిగి వస్తుందో లేదో అన్న అనుమాన పరిస్థితిలో, మొదట రావప్పంతులుకి, తరువాత కరటక శాస్త్రికి యివ్వడానికామె వెనుకాడదు. మధురవాణి స్వార్థ త్యాగం, ఉపకారబుద్ధి అటువంటివి

విజయనగరం నుండి రావప్పంతులుతో రామచంద్రపురాగ్రహారానికి వచ్చినప్పట్నుండీ, మధురవాణిలో అంతర్మథనం సాగింది. "కుక్కల పొత్తు" నుండి బయటపడి సంసారిగా బతకాలన్న గట్టి కోరిక రానురాను పెరిగింది.

"కాపు మనిషినై పుట్టి మొగుడి పొలంలో వంగ మొక్కలకు, మిరప మొక్కలకు దోహాదం చేస్తే, యావజ్జీవం కాపాడే తనవాళ్లనే వారుందురేమో" అన్న ఆలోచన మనస్సును పట్టి పీడించింది. "మధురవాణి అంటూ ఒక వేశ్యా శిఖామణి యీ కళింగ రాజ్యంలో వుండకపోతే భగవంతుడి సృష్టికి యెంత లోపం వచ్చివుండును" అని కరటక శాస్త్రి కురిపించిన పొగడ్తకు ఉబ్బితబ్బిబ్బయిపోదు సరికదా, "మధురవాణి అనే వేశ్యాశిఖామణి గిరీశంగారి వంటి కుక్కల పొత్తుకే తగివున్నది గాని సౌజన్యారావుగారి వంటి సత్పురుషులను చూడడమునకైనా అర్హత కలిగి వుండలేదు" అని దిగులు పడుతుంది. రాయబారాలు పంపుతూవున్న డిప్టీ కలక్టరును తృప్తిపర్చేందుకు వెళ్లమని కరటక శాస్త్రి తన చిక్కుల్నుంచి బయటపడడానికి ఎంతగా బలవంతం చేసినా, "యిటుపైని వూరకుక్కలనూ, సీమకుక్కలనూ దూరంగా వుంచడానికి ఆలోచిస్తున్నాను" అని చెప్పి, ససేమిరా వొప్పుకోదు.

వేశ్యల విషయంలో అహేతుకమైన మొండి పట్టుదలతో వున్న సౌజన్యారావుకు, వేశ్యాసమస్య గురించి ఆయన జవాబివ్వలేని ప్రశ్నలడుగుతుంది జపాన్ దేశంలో గైషాలన్న వేశ్యలున్నారనీ, వాళ్లను గొప్ప గొప్ప వాళ్లు పెళ్లాడతారనీ తాను విన్నట్టు చెపుతుంది. మధురవాణి తెచ్చిన యీ సాపత్యానికి కారణం, ఆమె మనస్సును కల్లోలం చేస్తోన్న వివాహేచ్ఛ; ఆ "దుర్వృత్తి"లోని "హైన్యత"ను గుర్తెరగడమున్నూ.

లుబ్ధావధాన్లుని గండం నుంచి గట్టెక్కించడానికి, స్వకార్యంగా పాటుపడుతున్న సౌజన్యారావును పురుషవేషంలో కలిసి, అతన్ని రక్షించే సాధనం ఒక వేశ్య చేతిలో వుందని మధురవాణి చెపుతుంది; ఆ వేశ్యతో పెళ్లికి కాని, వీలుకాకుంటే "వుంచుకోడానికి" కాని ఆయన వొప్పుకుంటే కార్యం నెరవేరుతుందంటుంది. "తలకు తగని వెర్రి కోరిక" అని తెలిసి కూడా, మధ్యవర్తిగా వ్యవహరిస్తూ యీ రాయబారం సాగిస్తుంది. సౌజన్యారావు వొప్పుకోడు సరికదా, కోపం తెచ్చుకుంటాడు కూడా చివరకు "అడుగు మెట్టుకు దిగి", షరతుగా "ఒక చిన్న ముద్దు"ను కోరుతుంది. ఆయన "మిక్కిలి మంచి వారు" కావడం, యీ కోరికకు కారణం. ఆ విషయమే చెపుతుంది. సౌజన్యారావు వొప్పుకోడు, బదులుగా వెయ్యి రూపాయలు తీసుకొని సాయం చెయ్యమంటాడు. ఇందుకు మదురవాణి వొప్పుకోదు పర్యవసానం ప్రతిష్టంభన.

చేసేదింకేమీ లేక, ఎలాగనైనా లుబ్ధావధాన్లును కాపాడాలన్న పట్టుదలతో వున్న సౌజన్యారావు "వ్రతభంగా"నికి సిద్ధపడతాడు. షరతును అమలు జరపడానికి దగ్గరకు వస్తాడు. ఈ విపరీత పరిస్థితిలో తీవ్రమానసిక

సంక్షోభంలోవున్న మధురవాణి నిగ్రహించుకొని, మనస్సు మళ్లించుకొంటుంది. - మానవాతీతమైన నిగ్రహం యిది చెడని వారిని చెడగొట్టవద్దని చెప్పిన తల్లి ఉపదేశం జ్ఞాపకం తెచ్చుకుంటుంది ప్రబలంగా వున్న తన కోరికను చంపుకుంటుంది. వృత్తిని వదిలిపెడుతున్నానని ప్రకటిస్తుంది సౌజన్యా రావును వ్రతభంగం కాకండా కాపాడుతుంది. లుబ్ధావధాన్లు సమస్యా పరిష్కారానికి దారి చూపి, సౌజన్యారావు కృతజ్ఞతకు పాత్రురాలవుతుంది. నాటకంలో యీ పరిణామాన్ని పెంపొందించిన తీరు అక్షరాలా సాటిలేనిది. ఇది సాటిలేని సిద్ధహస్తుడికి మాత్రమే సాధ్యమవుతుంది.

## "లోకమందలి మంచి చెడ్డలు"..

చదవడమో, చూడడమో ముగిశాక, కన్యాశుల్కం— కన్యాశుల్కమే కాదు— సాధారణంగా గురజాడ రచనలు మనస్సు మీద వేసే ముద్ర ఎటువంటిది? వాటివల్ల కొంతయినా చిత్త సంస్కారం కలగక తప్పదు, చెడుగుల మీద అసహ్యం పుట్టక తప్పదు, సత్కార్యాల వేపు మొగ్గు రాక తప్పదు. కన్యాశుల్కం శక్తి అటువంటిది. జడస్థితిలో వున్న మనస్సు మాత్రమే దాని ప్రభావానికి లోనవదు. మధురవాణి, సౌజన్యారావు పాఠకుల మెప్పు పొందడమూ; ఎంతగా నవ్వించినా అగ్నిహోత్రావధాన్లు, రావప్పంతులూ, గిరీశం అవహేళనకు గురి కావడమూ జరుగుతుంది. పరమాద్భుతమైన సాహిత్య శిల్పకళ, నాటక కథతోపాటు పాత్రలన్నిట్నీ కళ్ల ఎదుట నిలిపి వుంచుతుంది

ఇదే కాదు— "అడుగు జాడ గురజాడది, అది భావికి బాట" అని ఉద్ఘాటించిన శ్రీశ్రీ మాటల్లో, "విద్యా పిపాసి నాకర్షించే అన్ని వెలుగుల వైపూ ఆయన దృష్టి ప్రసరించింది. ఏ విషయాన్ని స్పృశించినా దాని మీద ఆయన వ్యాఖ్యానించే తీరు ఆయనదెంత ఆధునిక మనస్తత్వమో అతి స్పష్టంగా తార్కాణిస్తూ వుంటుంది . ఆయన ఆలోచన ఎంతసేపు సంఘపరంగానే సాగుతూ వుండడం మనకి గోచరిస్తుంది."[49]

కన్యాశుల్కం రాసి నూతన నాటక (వచన) సాహిత్య శకం ప్రారంభించిన పద్దెనిమిదేళ్ల తరవాత, గురజాడ నూతన కవిత్వ శకం ప్రారంభించారు. "లోకమందలి మంచి చెడ్డలు లోకులెరుగుదురా?" అన్నది, ఆ శకావిష్కరణకు నాంది అయిన "ముత్యాల సరములు" [50], కథానాయకుడి సందేహం. కాని యీ సందేహానికి సమాధానం ప్రశ్నలోనే వుంది :

49 చూ. "యుగకర్త గురజాడ" (వ్యాసం)
50. "ఆంధ్రభారతి", 1913, జులై.

కథానాయికలో వున్నట్టుగానే లోకంలో అజ్ఞానం, అమాయికత్వం నిండుగా వున్నాయి. దీనికి తోడుగా సాంఘిక అవినీతి క్రిములతో నిండివున్న కఠోర దాస్యం, సమాజాన్ని అప్రతిష్ఠ పాలు చేసే పరిస్థితులు వీటిని బయట పెట్టి, ఉన్నత నైతిక ప్రమాణాల్ని నెలకొల్పాలి. వాడుకలో లేని భాష కాకుండా వాడుకలో వున్న భాష యిందుకు సాధనం కావాలి. సాహిత్యానికి యింతకంటె మేలైన పని యింకొకటి లేదు.[51]

ఇందుకోసం, "మంచి గతమున కొంచెమేనోయి, మందగించక ముందు అడుగేయి" [52] అన్నది, గురజాడ ఉద్బోధ.

ఈ ఉద్బోధ, అప్పటి "సాంఘిక అవినీతి క్రిము" లకు, "సమాజాన్ని అప్రతిష్ఠ పాలుచేసే పరిస్థితు" లకూ మాత్రమే పరిమితం చెయ్యవలసిందీ, అన్వయించ వలసిందీ కాదు. గురజాడ జీవిత కాలం తరవాత చాలా దశాబ్దాలు గడిచి పోయాయి. ఆయన వేలెత్తి చూపిన చెడుగులు అప్పటి కంటే యిప్పుడు, ఏదో వొక రూపంలో, అంతకు మించిన ఉగ్రరూపంతో వున్నాయి ; సామాజికంగానే కాక సర్వరంగాల్లో వ్యాపించి వున్నాయి.

దేశంలో యిప్పుడున్న వ్యవస్థకు ప్రజాస్వామిక వ్యవస్థ అని పేరు. అయితే చిత్రమేమిటంటే, యీ ప్రజాస్వామిక వ్యవస్థ కింద దురవస్థల పాల య్యేది, ప్రజలు! ప్రజల కడుపులు కొట్టి జేబులు నింపుకొనే వాళ్లకు, కపాలాల సోపానాల మీంచి ఉన్నత శిఖరాలకు ఎగబాకే వాళ్లకు, యీ ప్రజాస్వామిక వ్యవస్థలో అందుబాటులోలేని సదుపాయాలేవీ లేవు.

స్వలాభం కోసం ఎటువంటి దారుణాలు చెయ్యడానికైనా జంకూ గొంకూలేని మనస్తత్వం దేశాన్ని నిర్వీర్యం చేస్తూ పోతోంది. కులం, మతం, ప్రాంతం పేరు చెప్పి ప్రజల్ని, దేశాన్ని ముక్క చెక్కలు చెయ్యడానికి కట్టుదిట్టమైన ఉద్యమాలు, పట్టపగలు నడివీధుల్లో బందిపోట్లు, మానభంగాలు, హత్యలు, కోడళ్ల సజీవ దహనాలు, మంగళ సూత్రాలతో సహా మెడలోని నగల అపహరణ, ఎత్తుకపోయిన దేవుళ్ల విగ్రహాలతో విదేశ వ్యాపారం - అంతటా దుశ్చింత, దుర్నీతి, దుష్కర్మల విలయ తాండవం, దుర్వాసనలు వెదజల్లుతూ నైతిక కాలుష్యం.

ఇటువంటి సామాజిక రుగ్మతల్ని రూపుమాపడానికి, సమాజంలో అంతర్భాగమైన సాహిత్యం కూడా విధిగా బాధ్యత పుచ్చుకోవలసి వుంటుంది. ఇటువంటి దుర్వ్యవస వల్ల దాపురిస్తోన్న దుష్ఫలితాల్ని ప్రజలకు నచ్చ

---

51 చూ. కన్యాశుల్కం అంకితం, తొలి కూర్పు పీఠిక
52 "దేశభక్తి", "కృష్ణా పత్రిక" 1913 ఆగస్టు 9.

జెప్పి, ఉన్నత నైతిక ప్రమాణాల్ని నెలకొల్పడం కంటె, ఎప్పటి సాహిత్యానికైనా మేలైన పని వేరే లేదు సాహిత్యానికి గురజాడ చూపిన దారి యిదే. ఈ దారిని తప్పడం, పెడదారులు తొక్కడమే అవుతుంది; సమాజం నుండి సాహిత్యాన్ని వేరు చేయడమూ అవుతుంది.

లోకులుంటున్నది, లోకంలోని మంచి చెడ్డల్ని ఎరగని స్థితి. ఈ దుస్థితిని తొలగించాలి. ఈ బృహత్తర కార్యం మహాకార్యం, దీని సాధనలో సాహిత్యం కూడా పాల్గొనాలన్నది, గురజాడ హితబోధ.

—సెట్టి ఈశ్వరరావు